దాయాలు, చారిత్రికపరిస్థితులు, ఆయాకవుల ప్రత్యేక స్వభావాలు, వారివారి తరతమభావాలు, మొదలైన విషయాలన్నీ జాగ్రత్తగా అవగాహన చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాము. అంతేగాని కేవలం స్థూలదృష్టి అవలంబించి ఆసామాషీగా ఆకాలపు రచనలన్నీ వట్టి అసభ్యరచనలనిగాని పనికిమాలిన చెత్త రచనలనిగాని కొట్టి పారవెయ్యడంలేదు! ఉదాహరణకు పెద్దన మనుచరిత్రే తీసుకుందాము. ఆకాలపు కవితాసంప్రదాయాలనుబట్టి పెద్దన తన మనుచరిత్రలో పురవర్ణన, గజాశ్వాది వర్ణనలు, విరహవర్ణన, సంభోగవర్ణన, అవయవవర్ణనలు మున్నగునవన్నీ ప్రవేశపెట్టాడు. ఈనాటి కవులుగాని విమర్శకులుగాని ఇలాంటి విషయాలాధునిక కావ్యాలలో అవశ్యకాలని అనుకోరు. మనదృష్టి కానాటి విరహాదివర్ణనలు కొన్ని మోటుగా కూడా కనిపించవచ్చును. అంతమాత్రంచేత పెద్దన అసభ్యవర్ణనలుచేశాడని మన మతన్ని దుయ్యబట్టడం లేదు.

నిజానికి పెద్దన్న చేసిన సంభోగాది వర్ణనలు మాత్రమే ఉదాహరించి వట్టి స్థూలదృష్టితో ఇది అసభ్యధోరణిలోకి దిగిపోయిందని కూడా తేల్చేసే. స్థూలంగాచూస్తే ఈవాదం చాలా సబబైనదే అని అంతగా లోతులు తెలియని పాఠకులెవరైనా అంగీకరిస్తారు. క్షేత్రయ్యను విమర్శించిన స్థూల విమర్శకులు కూడా సరిగా ఈపద్ధతే అవలంబించారు. ఈనాడు పెద్దన్న ఉత్తమ కవి అని సమర్థించడం హాస్యాస్పదమైనట్టుగానే క్షేత్రయ్య ఉత్తమ పదరచయిత అనీ ఇతనిలో అసభ్యతలేదనీ సమర్థించడంకూడా అలాగ చర్విత చర్వణమైన హాస్యాస్పద విషయమే!

ప్రబంధ కవులలో ఉత్తములలోనే తారతమ్యాలున్నాయి. ఎంత నిశిత పరిశీలనచేసినా ఈనాడు పెద్దనను మనమొక అత్యుత్తమ ప్రబంధ కవిగా గౌరవిస్తున్నాము. పెద్దనాది కవులలో ఉన్నట్టుగానే అన్నమాచార్యాది పద రచయితలలో తారతమ్యాలున్నాయి. అన్నమాచార్యులించుమించుగా ఈ ప్రబంధయుగానికి చెందినవాడే. ఆ కాలపు అభిరుచినిబట్టిగాని నిశితమైన ఈకాలపు అభిరుచినిబట్టి గానిచూస్తే ఇతనిలో అసభ్యతి ఎక్కడా గోచరించదు.

ఈ వ్యాసంలో ఉదాహరించిన క్షేత్రయ్య పదాలనుబట్టి అన్నమాచార్యుని రచనలలోను క్షేత్రయ్య రచనలలోను గల సంప్రదాయసామ్యాలు, పదరచనారీతులు, తారతమ్యాలు పాఠకులకు సులభంగానే స్ఫురిస్తాయి.

క్షేత్రయ్య అన్నమాచార్యునికి రెండుశతాబ్దాల అనంతరం ఉద్భవించినవాడు. ఇతనిలో రెండు శతాబ్దాల పదరచనా పరిణతివల్ల వచ్చిన చూపువాసి శృంగారవర్ణనాధిక్యంమాత్రం కనిపిస్తుంది. అంతేగాని ఇటీవలి విమర్శకులు స్థూలదృష్టితో ప్రదర్శించినంత అసభ్యత ఎక్కడా ఇతని రచనలలో కనబడదు.

అయితే ఈ విమర్శకులు క్షేత్రయ్య నాయికా వైవిధ్య ప్రదర్శనంకోసం సకృత్తుగా అక్కడక్కడ రచించినవి అనుచాన్తి నాయికాపరమైన పదాలు కొన్ని చదివి, సరియైన సాహిత్యిక దృక్పథంతో అవి అవగాహన చేసుకోలేక ఇటువంటి విమర్శనకు ఉపక్రమించారని తోస్తుంది.

అంగ ప్రత్యంగవర్ణనలు చేసినంతమాత్రాన రచయితమీద అసభ్యతారోపణ చెయ్యడానికి వీలులేదు. ఆ రచయిత ఆ విషయంలో అవలంబించిన ఉదాత్తానుదాత్త దృక్పథాలనుబట్టిమాత్రమే సభ్యతాసభ్యతలు నిర్ణయించాలి. క్షేత్రయ్య రచనలు సాహిత్యిక దృక్పథంతో పరిశీలించినవారికి క్షేత్రయ్య నాయికా స్వభావవర్ణనలలో ఎక్కడా అసభ్యత స్ఫురించదు. పైగా సూక్ష్మమైన ఈతని స్వభావ పరిశీలనలు పాఠకులలో ఆశ్చర్య గౌరవా లినుమడింపజేస్తాయి.

## ఆధునిక దృష్టి

క్షేత్రయ్యపదా లీకాలంలో కుమారి బాలికల గానాభినయాల కనర్హమైన వని ఇంకొక విమర్శ వచ్చింది. నిజానికి క్షేత్రయ్యలో ఇలాంటి పదాల సంఖ్య చాలా స్వల్పం. అదిన్నిగాక ఇది సాహిత్య విమర్శనకు సంబంధించిన సమస్య కానేకాదు. సుప్రసిద్ధులయిన పెద్దనాదుల కావ్యాల భాగాలన్నీ బాలబాలికల పఠన పాఠాలకు తగినవి కావు. మనం ఆ కావ్యాలలో సముచితములైన భాగాలే నేడు పాఠ్యభాగాలుగా నిర్ణయిస్తున్నాము. ఇది కేవలం బాల బాలికల విద్యా విధానానికి సంబంధించిన సమస్య.

క్షేత్రయ్యరచనలలో సకృత్తుగా అక్కడక్కడ కనిపించే కొన్ని పదాలు పరిహరిస్తే అవి నేటి బాలి

కల గానాభినయాలకు కూడా సముచితమైనవే. సకృత్తుగా కనిపించే కొన్ని పదాలుమాత్రం ఉదాహరించి క్షేత్రజ్ఞుని పద రచన అంతా చిత్తకింద జమకట్టడం సమ్యగ్దృష్టిలేని విమర్శకులు చేసేపనికింద జమకట్టాలి.

సుప్రసిద్ధులయిన తమిళ విమర్శకులు నేటివరకు క్షేత్రజ్ఞుని ఒక ఉత్తమ వాగ్గేయకారకుడుగా గౌరవించి ఇతనిపదాలు విరివిగా బాలికల నృత్యగానాలకుపయోగిస్తున్నారు.

మరి అదేమి దురదృష్టమోగాని ఆంధ్రదేశంలో కొందరు విమర్శకు లిటీవల ఇతనిమీద ఇతని పదరచనమీద లేనిపోని దోషారోపణల కుపక్రమించారు.

ఇతని కేర్పడిన క్షేత్రజ్ఞ నామధేయాన్నిబట్టి చూస్తే ఇతడు తీర్థయాత్రాపరుడైన ఒక భక్తుడై ఉండవచ్చునని చెప్పవచ్చు. ఇతడనేక క్షేత్రాలు దర్శించి ఆయా దేవతలమీద పదరచన చేశాడనీ, కనకనే ఇతనికి క్షేత్రజ్ఞ నామధేయం ఏర్పడినదనీ చెబుతున్నారు. ఆయా దేవతలమీద ఇతడు రచించిన పదాలనుబట్టి ఈ ఊహ సమంజసమైనది కావచ్చును.

అయితే క్షేత్రయ్య పదాలు ప్రకటించిన శ్రీ విస్సా అప్పారావుగారు తమ గ్రంథ పీఠికలో క్షేత్రయ్య నిజ నామధేయం మువ్వ వరదయ్య అనీ, మువ్వగ్రామానికి సమీపంగా సాలెంపాడు వేశ్యల సాహచర్యం కొంత ఇతని పదరచనకు ప్రోద్బలం కలిగించి ఉండవచ్చుననీ వ్రాశారు. పేరునుబట్టి చూస్తే ఇతడు తీర్థయాత్రాపరుడైన భక్తుడని అంటే అనవచ్చునుగాని, ఈ వేశ్యా సాహచర్యానికిమాత్రం ఇతని రచనలో ఎక్కువ తార్కాణం కనబడదు. ఇది కేవలం మువ్వగ్రామ పరిసరాలనుబట్టి వారు చేసిన ఊహాగానం మాత్రమే. మధురభక్తి ధోరణిలో పదరచన చేసినంతమాత్రాన ఈవిధమైన వేశ్యా సాహచర్యం కల్పించడం సముచితం కాదు. కేవలం రచనలనుబట్టి ఇలాంటి ఊహాగానాలు ప్రారంభిస్తే అన్నమాచార్యాది తాళ్ళపాక కవులకు కూడా ఇలాంటి తతంగాలు కల్పించవలసి వస్తుంది. అన్నమాచార్యాది తాళ్ళపాక కవులందరు ఉత్తమభక్తులుగా నేటికీ గౌరవింపబడుతున్నారు. అందుచేత అనుకూలంగాగాని వ్యతిరేకంగాగాని తగినన్ని సాక్ష్యాలు దొరికినదాకా ఇలాంటి విషయాలలో కేవలం తటస్థభావం అవలంబించడమే న్యాయ్యము.

శ్రీ అప్పారావుగారు క్షేత్రయ్యయెడల భక్తి గౌరవాలతోనే ఇలాంటి ఊహాగానాలు చేశారుగాని ఇటీవలి విమర్శకు లీ ఊహాగానాలు పట్టుకుని క్షేత్రయ్యమీద అతని పదరచనమీద అన్యాయమైన విమర్శలోకి దిగిఉండడంవల్ల ఈవిషయంలో ఇంలిగా వ్రాయవలసిన అవసరం కలిగింది.

క్షేత్రయ్యచరిత్రనుగూర్చీ అతనిపదాలనుగూర్చీ ఇంకా నిశితమైన పరిశోధన జరగవలసిన అవసరం ఎంతేనా ఉన్నది. క్షేత్రయ్య రచించిన పదాలన్నీ లభించినట్లుకనబడదు. అతడు కొన్ని వేలవరకు పదాలు రచించి ఉండవచ్చునని విజ్ఞులు అభిప్రాయ పడుతున్నారుగాని మన కింతవరకు లభించిన పదాలు కొన్ని వందలుమాత్రమే.

కొంత నిశిత పరిశోధన జరిగినమీదట క్షేత్రయ్య చరిత్రనుగురించీ పదాలనుగురించీ కొన్ని కొత్త విషయాలు బయటపడవచ్చును. ప్రస్తుతం క్షేత్రయ్య పేరుతో ప్రకటింపబడిన పదాలలో కొన్నికొన్ని ప్రక్షిప్తాలుండినా ఉండవచ్చును.

సంగీత సాహిత్యాభిజ్ఞు లీ విషయంలో ఇంకా నిశితపరిశోధనలుజరిపి విస్మృతప్రాయమైన క్షేత్రయ్య పదాలు పునరుద్ధరించగలరనీ, ఆంధ్రదేశంలోకూడా క్షేత్రయ్య పద కవితపై సముచితమైన దృక్పథం ఏర్పడగలదనీ, తద్ద్వారా మనదేశంలో క్షేత్రయ్య పదాలకు సముచితమైన గౌరవాదరాలు లభించగలవనీ, క్షేత్రజ్ఞుని పదకవిత నృత్యగానాలతో విలసిల్లగలదనీ ఆశిస్తున్నాను.

---

# దివ్యభావనము



శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

సాయంవేళ, గపర్ది నృత్యరచనాసంజాత శోభాసరి
త్తోయ స్నాత భవత్పదద్వితయ మాధు స్నిగ్ధచంచచ్ఛవి
స్వాయత్తమ్మగ, చిత్తభంభరము చేయఁ వే ప్రసాదింపవే
సాయంకాల నటన్మహా ప్రభుప్రియా! సర్వేశ్వరీ! శాంకరీ!

నటనాచాతురి నేర్పునీ మగని విన్నాణంపు జేష్టాళి, దు
ర్ఘటమై పొల్చెడు నీవులేనిది, యసంఖ్యాకమ్మగా సృష్టి, సా
గుటయెల్లఁ, మఱి త్వద్విలాసభ్రుకుటీ, కోటీర సంస్పందన
చ్ఛటలఁ సంభవమై విరాజిలెడులే సర్వేశ్వరీ! శాంకరీ!

అతఁడుఁ జేతనతావిభూతియగుచుఁ హార్వొంద జిచ్ఛక్తివై
తత బ్రహ్మాండములెల్ల దావక కృపాతారళ్య సంభూతి సు
స్థితి జెందఁ గరుణింతువంతటను గించిత్కుంచితాపాంగవీ
క్షిత దత్సంహృతి సల్ప జాలెదవటే సర్వేశ్వరీ! శాంకరీ!

అతఁడో నిష్కలమూర్తి! నీవో మఱి తద్వ్యాఖ్యాతృరూపస్థితిన్
బత శాంతావృత నిస్తరంగతకు వాత క్షుబ్ధ పాథోధి రూ
పత, గల్పించెదు శక్తివై మెలఁగుదంబా! యంతె కాసి విభి
న్నత మీ యిర్వురియందు మృగ్యమయెడుఁ సర్వేశ్వరీ శాంకరీ!

ఉదయాదిత్యనవారుణద్యుతులు ప్రద్యోతింప నుత్సాహ స
మ్మద సంరంభనిదానమై పొలిచెడుఁ, మధ్యాహ్న రోచిః ప్రభా
భ్యుదితంబై కనవచ్చు తావకలసన్మూర్తి స్ఫురద్దీప్తు ల
చ్ఛదయా శాంతములొల్కుఁ సంజలనహో! సర్వేశ్వరీ! శాంకరీ!

అంబా! వాల్చితి శీర్షముఁ నతుడనై, యశ్రుప్రవాహోర్మి సి
క్తంబుల్ యుష్మదుదారపాదములు, స్నిగ్ధంబుల్, ప్రపూతమ్ములా
లంబంబుల్ మఱి మాదృశార్తులకునుఁ, రాజత్కరం బెత్తి వే
సంబాళింపుమ యుష్మదాశిషములఁ సర్వేశ్వరీ! శాంకరీ!

భావింతుఁ, మది దావకీన కరుణా భాగీరథీ వీచికా
సేవా భాగ్యము నంది, నందనవనీ సేమంతికా సౌరభ
శ్రీవాల్లభ్యము నంది, మానసము, దృగ్రేఖాంతమై పొంగిన
ట్లై వర్షించుట బాష్పముల్ కనుగొనల్ సర్వేశ్వరీ! శాంకరీ!

భాసింతుఁ భవదీయమూర్తి రుచిరంబై, దివ్య గంగాంబుజ
శ్రీసాహస్రకమై, సుధాకర కళారేఖాపరిస్నాతమై
ద్యోస్రోతోంబు పవిత్రమై, మధురమై యోగీశ హృద్భావనా
శ్వాసంబై, శ్రుతిగేయమై, ప్రణతమై సర్వేశ్వరీ! శాంకరీ!



మధుర, తంజావూరు రాజులనాటి :

# దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము



శ్రీ నేలటూరి వేంకటరమణయ్య

(గతసంచిక తరువాయి)

## 3

నాయక యుగాంధ్ర సాహిత్యమును గురించి పెక్కు దురభిప్రాయములు ప్రబలియున్నవి. భాష పరిశుద్ధమైనది కాదు, రిత్యాకరణమున నది యుత్తరాంధ్ర కవిత్వముతో సరితూగజాలదు; కావున నది రెండవ రకమని చెప్పవలసి యున్నది, అని కొందఱభిప్రాయ పడుచున్నారు. వీరియందు ప్రముఖులు జయంతి రామయ్యపంతులుగారు. దాక్షిణాత్య కవులు చాతుర్య ప్రదర్శనమే కవిత్వమునకు పరమావధియని యెంచి రసనిద్ధికొఱకు సాంప్రదాయమును వీడిచ్చి భాషా సాంకర్యమును కావించిరి; వారి రచనలలో నొప్పుకట్టు వ్యాకరణ విరుద్ధ ప్రయోగముల కనేకముల కిదియే కారణమని పంతులుగారు సెలవిచ్చిరి. భాషా విషయములందు పంతులు వారు పరమ నైష్ఠికులు. కవిత్రయము వారి నియమాలు పెట్టి కొలతబద్ది. తిరనుసారము రచింపజాలని కవులను తెగ మెచ్చరు. తెనుగు లోక వ్యవహారము నందెంకను ప్రవర్తిల్లుచుండు జీవభాష యను సంగతిని వీరు విస్మరించినట్లున్నది. జీవభాషలకు నిత్య పారిశుద్ధ్యము చేకూరదు. నానాటికి కవి యభివృద్ధి నందుచుండును. ఈ యభివృద్ధి ననుసరించి భాషా పరిశుద్ధి మాఱుపు లేక యెల్లప్పుడు నొక్కతీరున నుండదు. దాని స్వభావము నూతన పరిణామములనందుచు యుగయుగమునకును భిన్నముగుచుండును. మఱియు గవిత్వ గుణావగుణములను నిర్ణయించు నప్పుడు వ్యాకరణ మొక్కదానినె యొరగల్లుగ గ్రహించుట యుక్తము గాదు. "శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" అని పెద్దలు చెప్పుదురు. కావున కావ్యరచనయందు శబ్దార్థములు రెంటికిని సమాన గౌరవము గలదు. వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు కాదా చిత్తముగ గానవచ్చినంతటనె కావ్యములను గ్రిందుపఱచుట సమంజసము గాదు.

ఈ సందర్భమున వీరేశలింగము పంతులు వారి వాక్యములు స్మరింపదగినవి. "ఇప్పటి వారు కవిత్వ స్వారస్యమును విచారింపక గ్రంథములందు రేఫవ్యయ ప్రాస విశేషమాత్రియో, యేదో వ్యాకరణదోషమో యున్నదన్న హేతువుచేత రసవంతములైన యుత్తమ గ్రంథములను సహిత మగ్రాహ్యమని నిరాకరించుచున్నందున, అట్లు చేయుట యుక్తము కాదు. ఛందో వ్యాకరణ దోషములు లేని రసహీనములగు గ్రంథములకంటె ఛందో వ్యాకరణ దోషములను గలవయినను రసవంతములయిన గ్రంథములే యధికాదరణీయములు."

నాయకయుగము క్షీణయుగమనియు, నీ కాలమున తెలుగు కవిత్వము ప్రోత్సాహకులు లేక వను కటిశీషులలోనే విస్తారము వడెచినదనియు, నూతన ప్రతిభక్షీణించెననియు, నక్కన పోతనగార్లవలె కవిత్వము దివ్యకళ యని విశ్వసించిన వారుగాని శ్రీనాథునివలె రసోచితముగ వ్రాయగలవారు గాని, పింగళి సూరనవలె నూత్న కల్పనలు జేయగలవారు గాని యీ కాలమునలో లేరనియు, సాహిత్యము క్షీణదశలో నుండుటకు గారణము సంఘ జీవితము హీనస్థితిలో నుండుటయే యనియు ఖండవల్లి లక్ష్మీరంజనముగారనుచున్నారు.

సీతారామ భట్టాచార్యులవారు వచించినట్లు, "దక్షిణాంధ్ర వాఙ్మయ మింతయని యిప్పటికిని చెప్పజాలనుపడెను. రఘునాథ రామాయణము రచియించి నట్లు చెప్పు గ్రంథము లిప్పటికిని బయట పడలేదు. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు తవ్వాఙ్మయమును

ప్రపంచమున కెలుక చేయుటలో ప్రథములైనను, దాని నైఖరి నెఱిగిరో సంపూర్ణముగ తెలియదగెరి." పరిషత్తు వారొక్కరే కారు,—చెప్పిన గటువుగ నుండును—గాని, వాస్తవముగ దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయ విమర్శకుల కనేకుల కావాఙ్మయముతో బరిచయము తక్కువ. "ఈ కాలములో కవిత్వము క్రొత్తపోకడలు లేక నొకటి రీతులలోనే విస్తారము నడచెను" అని చెప్పిన లక్ష్మీరంజనముగారే "ఇది క్షీణయుగమైనను ఈ కాలములో పెక్కు సాహిత్య ప్రక్రియలు ఆంధ్రభాషలో వెలసినవి. మొట్టమొదటిసారి వచనరచనము విస్తారముగా ఈ కాలముననే జరిగినది. యక్షగానము లని పిలువబడు నాటకము లీనాడే వ్యాప్తిలోనికి వచ్చినవి" అని వ్రాయుచ్చినారు. వచనరచనము యక్షగాన ప్రాదుర్భావము క్రొత్తపోకడలు గావా? కావ్యరచనయు నొక్కటి మార్గమున సాగలేదు. ఉత్తరాంధ్ర ప్రబంధములు వర్ణనా ప్రధానములు, అందు కథాంశమల్పము. ఔచిత్యము బరిపాటింపక ప్రబంధ కవులు వారి గ్రంథములలో నిచ్చవచ్చినట్లు వర్ణనలు పెంచిరి. కృష్ణరాయ విరచితాముక్తమాల్యద, భట్టుమూర్తి కృతి వసుచరిత్ర మున్నగు ప్రబంధము [illegible] ఇందుకు ప్రమాణము. నాయక యుగ కావ్యము లట్టివి కావు. అందు కథాంశము ముఖ్యము. వర్ణనలకొఱకు కథ నొక కొంచెమును నిలచిపోదు. వర్ణనలు లేక పోలేదు. కాని యవి కథ కనుగుణముగ వచ్చును. విజయ విలాస కవుల కావ్యచరిత్రములను మనువసు చరిత్రలతో పోల్చిచూచిన నుత్తరాంధ్ర ప్రబంధములకును నాయకయుగ కావ్యములకు గల భేదము తెల్లము కాగలదు. తిక్కన పోతనాదుల వంటి మహాకవులు ప్రతి శతాబ్దమునను బుట్టరు. అట్టి వారు లేక పోయినంత మాత్రమున వాఙ్మయము క్షీణదశకు వచ్చెనని చెప్పుట నెరపు గాదు. నూతన ప్రతిభ క్షీణించిన దని యనుకొనరాదు లక్ష్మీరంజనము గారు. వారి యభిప్రాయమే మనకు తెలియరాకున్నది. ప్రతిభ యనగా నప్పటప్పటికి వికసించెడు బుద్ధియని యర్థము చెప్పినారు శబ్దరత్నాకర కారులు. మేధావి శేషము గల కవులెవ్వరు నీ యుగమున బుట్టలేదని గాబోలు వీరి యభిప్రాయము. అట్లయిన నట్టి తలంపు ప్రమాద జనితమని చెప్పవలయును. కథా సంవిధానమునగాని, కల్పనా చాతుర్యమునగాని, చమత్కార వచోవిన్యాసమునగాని, వర్ణనా గాంభీర్యమునగాని నాయక యుగాంధ్ర కవులెవ్వరికిని దీసిపోరు. చేమకూర, [illegible], శేషము, కంకంటి, పుష్పగిరి, ధరణి దేవుల కవులు వర్ధిల్లిన కాలమును క్షీణ యుగమనుట సాహసము గదా?

---

దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయము నీతి బాహ్యమని వెంచయ్య భుజంగరావు గారలు ఖండించిరి. దాక్షిణాత్య కవులు పాతివ్రత్యము కంటె వ్యభిచారమును అతిశయముగ వర్ణింతురనియు దుర్నీతి నుపదేశింతురనియు దత్కారణమున నది యనర్థకరమనియు చెప్పిరి. సీతారామా భట్టాచార్యుల వారు వారి విమర్శ నొప్పుకొనక యది వారి క్రైస్తవ మతాభిమానము పెంపున జేసిన దుర్విమర్శయని నిరసించిరి. కాని యిట్టి విమర్శ కంకురార్పణము జేసిన వారలు వెంచయ్య, భుజంగరావు గారలు గాదు. వీరికి దారిచూపినవారు వీరేశలింగము పంతులు. పంతులుగారు తమ యాంధ్ర కవుల చరిత్రయం దచటనచట కొందఱు కవులను గూర్చి చెప్పిన అభిప్రాయములను [illegible] దెచ్చి దాక్షిణాత్య వాఙ్మయ మంతటిమీదను సాగబెట్టిరి. ఇది వీరు చేసిన పొరపాటు. కాని వాస్తవముపై దృష్టియుంచి చూచితిమేని యిట్టి విమర్శకు కొంత చోటు గలదని తోచకపోదు.

నాయక యుగము శృంగార యుగము. భోగమప్పటి యాంధ్రులకు జీవన పరమావధియైనది. స్త్రీలోల్యము సామాన్యము; బహు కళత్ర గ్రహణమును, వేశ్యాంగనా గమనమును సిరి గలవారికి లక్షణములు. కేవలాంగ భోగములతో దృప్తినందియుండక ధనవంతులగు రసికపతులు స్త్రీల సర్వాంగములనే కాక స్త్రీ పురుషుల పరస్పర సంబంధ వర్తనలను [illegible] బయలుపెట్టరాని మర్మవిషయములను గూడ నాయక నాయికా వ్యాజమున పలువిధముల వర్ణింపించి యానందించెడివారు. ఈ కారణముచేత నాయక యుగాంధ్ర వాఙ్మయమునకు గళంకు దెచ్చెడి నీతి బాహ్య కావ్యములు పెక్కు బయలుదేరినవి. కాని దాక్షిణాత్య వాఙ్మయము సర్వమును నీతిబాహ్య శృంగార వర్ణనాత్మకము గాదు. కొందఱు దాక్షిణాత్య కవులు హద్దుమీఱి శృంగారమును పచ్చిగ వర్ణించినది వాస్తవమే. కాని వారి తప్పునకై దాక్షిణాత్య వాఙ్మయము నంతటిని దూషించి ఖండించుట సద్విమర్శకుల పద్ధతి కాదు.

ఈ సందర్భమున దృష్టియందుంచు కొనవలసిన యంశమొకటి కలదు. కావ్యనిర్మాణము యొక్క ముఖ్యప్రయోజనము ధర్మోపదేశము గాదు. ప్రపంచాను

భవమువలన గలిగిన భావోద్రేకము శబ్దరూపమున బహిర్గతమై కవితయన బరగుచున్నది. రసాలంకార భూషితమైన కవిత కావ్య మనబడును. కావున కావ్యోత్పత్తికి ప్రధాన కారణము ప్రపంచానుభవము వలన నలుగు భావోద్దీపనమే. ప్రపంచానుభవము బహువిధములైనది. దానినిబట్టి భావము లనేక రూపములు ప్రభవించుచుండును; వాని ననుసరించి కవితా వస్తువయును మారుచుండును. ఏతత్కారణమున కవిత్వము నిర్నిరుద్ధమై యుండవలయుననియు, నీతి నిబంధనలను కవులు సరకు సేయవలసినది లేదనియు వాదించు వాఙ్మయ విమర్శకులును గలరు. కావున శృంగారాత్మకమైనదని దాక్షిణాత్య వాఙ్మయమును వెలివేయ బూనుట భాష కపకారము చేయ బూనుటయే కాని యన్యము కాదు.

## 4

నాయక యుగమునం దాంధ్ర సాహిత్య వాహిని బహుముఖముల బ్రవహించినది. ఇందు ముఖ్యమైనవి మూడు. కావ్యము, నాటకము, గీతము.

౧. కావ్యము:— ఇది త్రివిధములైనది, పద్య కావ్యము, ద్విపదకావ్యము, వచనకావ్యము.

పద్యకావ్యములు:— దాక్షిణాత్యాంధ్ర పద్య కావ్య రచయితలలో ప్రథమమున పేర్కొనదగిన వాడు తంజావూరు రఘునాథ నాయకుడు. ఇతడు బహు గ్రంథకర్త. నూఱు గ్రంథములను రచించెనట! విజయరాఘవ నాయకుడు తన తండ్రి రచించిన గ్రంథములను కొన్నింటిని పేర్కొనియున్నాడు.

భువిమెచ్చ నచ్యుతాభ్యుదయ కావ్యంబు
నవరస చిత్రంబు నలచరిత్రంబు
హరువైన పారిజాతాపహరణంబు
మెఱవడి జూపు వాల్మీకి చరిత్ర
జానకీ కల్యాణ చాటు కావ్యంబు
తా నిర్వహించిన టెక్కైన కృతులు.

ఇవి యన్నియు నాంధ్రకృతులని తోచెడిని. ఇందు పారిజాతాపహరణ కావ్యరచనను గూర్చి యజ్ఞనారాయణ దీక్షితులు తన సంగీత రత్నాకరమునం దిట్లు చెప్పియున్నారు.

యా మన్వయేన యదు వేతరి పారిజాత
మాజీహరత్సరస మచ్యుత భూప సూనుః
కావ్యం తదత్ర విబుధైస్తు కథం కథంచి
దాలేఖి చిత్ర మవధాయ ఫణీంద్ర కల్పైః॥
ఏవం వచస్తనయ మేఘ కృపారసాప్త్యైః
జాతాభిషేక మపి తం జగతీబిడౌజాః
తత్రాభ్యపి ఇృతి మణిభి రసౌ సభాయా
మాసిత్స ఏవ వసుధేశ పటాభిషేకః॥

ఇందువలన రఘునాథ నాయకుడు పారిజాతాపహరణమును ఆశువుగా చెప్పెనని తెలియుచున్నది. ఇదిగాక రామాయణమును రఘునాథుడాంధ్ర కావ్యముగా రచించి దానిని మధురవాణిచే సంస్కృతీకరణము గావించెను. ఈ యంశమును రఘునాథుని వాక్యములుగ మధురవాణి ఇట్లు తెల్పుచున్నది.

"రసోత్తరం రామ కథాసు బంధ కావ్యం
మయా కల్పితమాంధ్ర వాణ్యా
కార్యం కయా సంస్కృతి వాగ్విలాసే
ఇత్యేవచిత్తే గణయన్న వాత్సీత్.
అజహదలంకృతిక్రమ మనేక రసోల్లసితం
సరస పదార్థ సంగతి సమగ్ర గుణానుగుణం
రఘు రమణ ప్రబంధ తిలకం రసికాభిమతం
సుదతి విధేయతా మితి సదాదిశన్నృపతిః ?

రఘునాథ కృతములని పై పేర్కొన్న ఆంధ్ర గ్రంథములలో రెండు మాత్రమే యుపలబ్ధమైనవి. అందు రామాయణ మొకటి, కాని ఇది మధురవాణి సంస్కృతములోనికి దిగ్గుమారు చేసిన రామాయణమని తోచదు. ఏలనగా, మధురవాణి రామాయణము చిన్న కావ్యము. ఇందు పదునాలుగు సర్గలును మొత్తము మీద ౧౫౦౦ శ్లోకములు గలవు. కాని మనకు లభ్యమైన రఘునాథ రామాయణ మసమగ్రము; ఇందు బాలకాండమునందు మూడాశ్వాసములును నాలవ యాశ్వాసారంభము నందిరువదియారు పద్యములు మాత్రము కలవు. ప్రథమాశ్వాసమంతయు పీఠికయు బాలరామాయణమునకును సరిపోయినది. ద్వితీయాశ్వాసము కోసలదేశ వర్ణనతో ప్రారంభమై ఋష్యశృంగ చరిత్రతో ముగిసినది. తృతీయాశ్వాసము ఋష్యశృంగుని యయోధ్యాగమనముతో నారంభమయి పుత్రకామేష్టితో ముగిసినది. నాల్గవ యాశ్వాసము శ్వేతద్వీప వర్ణనతో నారంభమైనది. మొత్తముమీద నందు పద్యములుగాని వచనములు గాని ౨౬౭ కలవు. దీనినిబట్టి చూడగా రఘునాథుడు వ్రాయ మొదలుపెట్టిన ఈ రామాయణము

నాథుఁ గ్రంథములతో బోల్చి చూచిన నీ విషయము తెల్లము కాఁగలదు.

## చేమకూర వెంకట కవి

ఇతఁడు రఘునాథుని యాస్థానాంధ్రకవి బృందమునకు శిరోమాణిక్యము. దాక్షిణాత్యాంధ్ర కవులలో నింతటి మించిన కవిలేఁడు. ఇతఁడు సారంగధర చరిత్ర, విజయ విలాసములను రెండు గొప్ప కావ్యములను రచించి రఘునాథుని కంకిత మిచ్చెను. సారంగధర చరిత్ర వేంకట కవి యొక్క ప్రథమ రచన. కవిత్వము రసవంతమైనదే. కాని విజయ విలాసములోని పరిపక్వత యందు గానరాదు. చేమకూర వారి కవిత నాంధ్రలోకము చిరకాలము క్రిందనే చవిచూచినది. ఇంటి పేరు నసయైనను, కవిత్వము పసగా నున్నదని యొక ప్రాచీన వాఙ్మయ విమర్శకుఁడు వక్కాణించెను. "ఈ చేమకూర చక్కెరమడిలో నమృతము పారించి పెంచినది కాని మట్టిలో నీరు పారించి పెంచినది కాదు." అని యానందపరవశులై యభాషించినారు పూజ్యపాదులు కీ॥ శే॥ బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి గారు. సెబాసని యామోదించినది ఆంధ్ర విద్వత్ప్రపంచము. "పింగళి సూర్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమునకు తరువాతి విజయవిలాసమే సర్వవిధముల చేతను తెలుఁగులో శ్లాఘ్య కావ్యముగ నున్నది." "సామెతలతోను, శబ్దాలంకారములతోను నిండియుండి యర్థగౌరవము కలదయి రసవంతమయి యున్నందున చేమకూర వేంకటకవి కవిత్వము సర్వజనాదరణీయమయిన దని తలచుచున్నాను," అని సెలవిచ్చినా రాంధ్ర కవి చరిత్రకారులు

వాస్తవముగ చేమకూర వారి కవిత్వము నెంత పొగడినను తనివి తీరదు. వేంకటకవి భాషింప నేర్చిన యమృత ధారాధరము. అతనిది సాధారణ కవిత్వము గాదు. ఆ మనియందు చిగురాకు జొంపములలో డాగి కర్ణరసాయనముగ బాడుకోయిల గానము. ఇందు సుధారసమును మరపించు మృదు మధురధారయు, శిరీషకుసుమ పేశలమయోక్తులును, ఆనందాబ్ధి నోలలాడించును. ఒక వింత. కవీశ్వరులు రసధునీ ప్రవాహమువలెను చమత్కార పయఃపూరమువలెను గవనము చెప్పుచున్నారు. ఈ రెంటిని సమ్మేళనము గావించి యత్యంతరమణీయముగను హృదయంగమముగను కావ్యకల్పన చేసినవారు కొందరే. ఇందు మహాకవి రామరాజభూషణుఁడు ప్రముఖుఁడు. మన చేమకూర కవియన్ననో రామరాజ భూషణుని యనుకరించి నాఁడు, అగ్రస్థానము నాక్రమించినాఁడు. ఈ విషయమునం దితఁడు రామరాజ భూషణునికంటెను, వేయేల ఆంధ్రకవు లెల్లరకంటెను మిన్నయై వన్నెకెక్కెను. రసగుంఫితముగాని పదమునుగాని పద్యమునుగాని యాతని గంటము వ్రాయ నెఱుఁగదు. అద్భుతవర్ణనలు శబ్దార్థాలంకారములు, చమత్కారోక్తులు వెల్లికొల్లలై యుల్లమును రంజింపఁ జేయును. సారస్యపు గల్పవృక్షముపై నల్లిబిల్లిగ నల్లుకొన్న యమృతవల్లివంటి దితని చమత్కారము. బుద్ధికి సులభముగ గోచరముగానివిధమున భావశబ్దార్థములతో లంకె బిగిలియున్నది. ఇట్టి యసామాన్య కవితాప్రభావము గల్గినవాఁడగుటచేత నే,

"తారసపుష్టిమైఁ బ్రతిపదంబున
జాతియు వార్తయుం జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ
ననేక కృతుల్ ప్రసన్నగం
భీరగతిం రచించి మహిమించిన"

యా రఘునాథ భూపరసికాగ్రణి వేంకట కవి కావ్య కన్యలను వలచి వరించెను.

కృష్ణాధ్వరి:- కృష్ణాధ్వరి రఘునాథ భూపాలుని యాస్థానము నలంకరించిన విద్వత్కవిపుంగవులలో మఱియొక్కఁడు. ఈయన బహు గ్రంథకర్త. తాను వ్రాసిన గ్రంథములన్నిటిని రఘునాథునికే యంకిత మొసఁగెనట. వినుఁడు:

నవరస శ్రీ రఘునాథ భూపాలీయ
నామ కామాభీష్ట దాయకుండు
నైషధ పారిజాతావతారిక కావ్యవర్యా
స్వయంవర వల్లభుండు
కల్యాణ కౌముదీ కందర్ప నాటక
కన్యోద్వాహన బద్ధ కంకణుండు
అమరుకామాంకార హారి భంగీక
శృంగార సంజీవనీ కాముకుండు
తాళ చింతామణి వఘూలిత్వరుండు
మంచిమాటి రఘునాథమనుజ నేత
తెలియ నైషధ పారిజాతీయ కృతిసా
పేక్షరక్కల చెప్పనై [illegible]చ్చినను.

ఇందువలన కృష్ణాధ్వరి రఘునాథ భూపాలీయము, నైషధ పారిజాతీయావతారిక, కల్యాణ కౌముదీ కందర్ప నాటకము, శృంగార సంజీవని,

తాళ చింతామణి, నైషధ పారిజాతీయమను నాలు గ్రంథములను రచించె నని తెలియుచున్నది. వీనిలో రఘునాథ భూపాలీయము విద్యానాథ మహాకవి విరచిత ప్రతాపరుద్రీయమువంటి యలంకార శాస్త్రమనియు సంపుటములే యిందును ప్రతి శ్లోకమునను కృతి పతి నామము రగిలియున్నదనియు శ్రీ చల్లా సత్యనారాయణగారు చెప్పుచున్నారు. ఈ రఘునాథ భూపాలీయమును నైషధ పారిజాతీయమును దప్ప తక్కిన గ్రంథములు గాన్పించుట లేదు. ఇవి సంస్కృత గ్రంథములని కొందరు ఊహించుచున్నారు. శృంగార సంటేమం సంస్కృతమున రచియింపబడి యుండవచ్చును, తక్కినవానిమాట యిదమిద్ధమనుటకు వీలు లేదు, అవి తెలుగు గ్రంథములైనను కావచ్చును. అనునేని కల్యాణ కౌముదీ కందర్ప నాటకము యక్షగానము కావచ్చును.

నైషధ పారిజాతీయము ద్వ్యర్థి కావ్యమని దాని పేరే తెల్పుచున్నది. ద్వ్యర్థి కావ్యకర్తలలో నితనిస్థానమున్నతమైనదని విమర్శకుల యభిప్రాయము. పింగళి సూరన "రాఘవ పాండవీయము"ను రంజకముగాను ప్రౌఢముగాను రచియించెను. తెనాలి భట్టుమూర్తి యను హరిశ్చంద్ర నలోపాఖ్యానమును రచియించి యాత్రోవను ద్రొక్కెను. కాని నైషధ పారిజాతీయము పై రెంటివలెకాక చిక్కని శైలిలో వ్రాయంబడినది. రెండు ప్రబంధములవలె నడచుచున్నది." అని సీతారామ భట్టాచార్యులవారు వక్కాణించి యున్నారు. "సూరన తొలుత రచన యనుటచేత గావలయును ప్రబంధమునందువలె వర్ణనలపై దృష్టి నిలుపక కథా కథనవ్యగ్రుడై రాఘవ పాండవీయమును రచించెను. ... రామరాజ భూషణుడు .. హరిశ్చంద్ర నలోపాఖ్యానముల కథను గైకొనుటయే కాక ప్రబంధోచిత వర్ణనలన్నియుం జేర్చి సూరన్న కన్న ద్వ్యర్థి కావ్యరచనలో నధికుడనని పించుకొనుటకు ప్రయత్నము చేసెను. కృష్ణాధ్వరియు వారిని మీఱం దలచి వర్ణనలను చేర్చుటయేకాక కథాకల్పనయందును మృదుపదార్థ రచనయందును దృష్టినిల్పి తన ద్వ్యర్థి కావ్యమును ఒక్కని ప్రబంధద్వయముగా సంతరించెను!' అని చల్లా సత్యనారాయణగారు వచించి యున్నారు. ఇదియంతయు వాస్తవమే కావచ్చును. శ్లేషకావ్యకర్తలలో కృష్ణాధ్వరి కడు దొడ్డవాడే కావచ్చును. కాని శ్లేష కవిత కాలికి వగిల్చిన సంకెల; భావప్రకటనను నిర్నిరోధముగ సాగనీయదు. ఎట్లు నిజాకర్షణశక్తివలన సర్వపదార్థములను భూమి తనవైపున కాకర్షించుచున్నదో యట్లే శ్లేష కవి దృష్టినంతటిని బహ్వర్థ పదసంయోగమువంకనే లాగుచుండును. కావున కృష్ణాధ్వరియు నన్య శ్లేష కావ్యకర్తలవలె దిన యావచ్ఛక్తిని వలసిన యర్థములు గలపదములకూర్పునందే వినియోగింపవలసి వచ్చెను. వీరేశలింగముపంతులుగారన్నట్లు, "ఇట్టి గ్రంథములయందు నిఘంటువులు వెదకి పదములనేర్చి కూర్చిన శిల్పప్రౌఢిమయే కాని యర్థచమత్కారముగాని భావగౌరవముకాని రసపుష్టిగాని పుట్టదు." కృష్ణాధ్వరి నేర్పును పాండిత్యమును నెంత ప్రశంసాపాత్రములైనను, సమకాలికులగు రఘునాథ వెంకట కవుల కవిత్వమువలె నుత్తమమైనది కాదు.

కాళయ్య:—రఘునాథ నాయకుని కాలము నుండియు తంజావూరు రాజ్యాస్థానము నాశ్రయించుకొని యున్నను, కాళయ్య మంచుపేర్కొనది విజయరాఘవుని కాలమునందే.

'అయ్య దినములు రామభద్రమ్మ నాడు
నేడు కృష్ణాజి కవితల నేర్పు మెఱసి
వినికి సేయుటయెల్ల మీ ఘనతగాదె'

యను విజయరాఘవుని వాక్యమువలన కాళ కవి తంజావూరాస్థానమునందలి భోగాంగనలకు విద్య గఱపెడువాడని తెల్లమగుచున్నది. ఇతడు రచించినది రాజగోపాల విలాసమను గ్రంథ మొక్కటియే. ఇటీవల నిది తంజావూరి సరస్వతీ మహాలు పుస్తక భాండాగారాధికారులచే ప్రకటింపబడినది. ఇది నైదాశ్వాసముల గ్రంథము. మన్నారుగుడి స్థల పురాణము. మొదటి యాశ్వాసమున చాల భాగము పీఠికకు సరిపోయినది, తక్కిన భాగమున రుక్మిణీ కృష్ణుల సంయోగము వర్ణింపబడినది. రుక్మిణీస్వీయ యని పేర్కొనబడినది. ఇట్లే చతుర్థాశ్వాసము తుదివఱకు, కలహాంతరిత భద్ర, జారిణీ లక్షణ, విప్రలబ్ధ జాంబవతి, ఖండిత మిత్రవింద, విరహోత్కంఠిత సుదంత, ప్రోషిత భర్తృక కాళింది, స్వాధీన పతిక సత్యభామ వీరితో గోపాలకృష్ణుని కూటమి వర్ణింపబడినది.[1] కృష్ణుని యష్టభార్యలను అష్టవిధనాయికలుగ చిత్రిం

1. జారిణీ భద్ర, పుట ౧౮౪, జారిణీ లక్షణ యని పుట [illegible], రెండుపర్యాయములు జారిణులను వర్ణించినట్లు ముద్రిత ప్రతియందు గలదు. ఇది పొరపాటు. సంపాదకులు దీనిని సవరించియుండిన బాగుగ నుండియుండును.

చుట కాళియ ప్రధానోద్దేశమని తెలియవచ్చుచున్నది. పంచమాశ్వాసమున మన్నారుగుడి స్థలమాహాత్మ్య కథనము గలదు. కవిత్వము సరసమైనదే. ఇతని సమాస రచన శ్రీనాథుని రచనం దలపించుచున్నదియు, నన్నయ వలె ముక్తాభివృత్తము నపేక్షించుటయందు గట్టివాడనియు, శృంగార రసమును ఆంధ్రకావ్యములందు వలెగాక అమరుక కావ్యమునందువలె భావ ప్రధానముగనె యావిష్కరించినాడనియు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాయుచున్నారు. వ్రతానాముత్తమం వ్రత మను న్యాయము బట్టి చెప్పిన మాటలని తోచుచున్నవి. ఇంతకంటె, "ఈతని కవిత్వము రసవంతమైనదే కాని విశిష్టతయును గలది కాదు." అను సీతారామ భట్టాచార్యులవారి యభిప్రాయమె సత్యమునకు దాపుగ నున్నది.

ఒక దృష్టిని జూచిన వేశయ్య తరువాతి మధురాపురాంధ్ర కవులకు మార్గదర్శకుడైనట్లు తోచుచున్నది. ఇతని శృంగార వర్ణనలు నాయికానాయకుల లోండ్రోగుల కూటమింగోరి పడు నాపసోపములను గ్రహించుచున్నవి. మధురాపుర కావ్యములం దీలక్షణము మెండుగ గానవచ్చును. మధుర వారికి తంజాపురకవు లాదర్శప్రాయులగుటవలన నేక వేశ వారీ వలపుటుంపరాద్భును వేశయ్యకవి నశ్వయించి యుండెనని యూహింపవచ్చును.

రంగాజమ్మ:—ఈమె తన సమయాదుల నిట్లు చెప్పుకొన్నది. "విచిత్రతరపత్రికా శతలిఖిత వాణీ కార్ణవ గాన ప్రసంగ త్రిప్పితి పత్రికా శతసహస్ర లేఖన ప్రశస్తకీర్తి. శృంగార రస పరంగిరి పద కవిత్వ మహనీయమతిసార్వభౌమ. అష్టభాషా కవితా సర్వంకషముసూనాష్ట విశేష శారద. రాజనీతి విద్యా విశారద, విజయరాఘవ మహీపాల రచిత కనకాభిషేక." పాటలు పదములుగాక రంగాజమ్మ యనేక గ్రంథములు రచించెను. సంగ్రహ రామాయణ భారత భాగవతములు మూడు; మన్నారు దాస విలాసోషా పరిణయ ప్రబంధములు రెండు; మన్నారు దాస విలాస యక్షగాన మొకటి. ఇందు మొదటి మూడును నామమాత్రావశిష్టములైపోయినవి, తక్కిన మూడును తంజావూరుసరస్వతీమహలు పుస్తకభాండాగారమునందున్నవి. మన్నారు దాస విలాస యక్షగాన మాంధ్ర సాహిత్యపరిషత్తువారిచే ముద్రింపబడినది. తక్కినవి రెండును అముద్రితములు. ఎవ్వరో యొకరిద్ద రీ గ్రంథములను జదివిరి. దూరమున ద్రావిడదేశమున నిక్షిప్తమై యుండుటచే నివి యాంధ్రుల కంగుబాటున లేవు. కావున వారి యభిప్రాయములను అంగీకరించి తృప్తి పడవలసి యున్నది. వీరిలో గణ్యులు కురుగంటి సీతారామ భట్టాచార్యులవారు. వీరు తంజావూరు పుస్తక భాండాగారాధికారులై యున్నపుడు భాండాగారములోని యన్యాంధ్ర గ్రంథములవలె రంగాజమ్మ కృతులను జక్కగ పరిశోధించి వానికి గాకితపు ప్రతులను వ్రాయించిరి. ఈమె గ్రంథములను వీ రిట్లు ప్రశంసించి యున్నారు.

"ఉన్నవానిలో మొదటిది మన్నారుదాస విలాసము. ఈ గ్రంథమునందలి నాయకుండైన మన్నారుదాసుండు విజయరాఘవ నాయకుండే. ఈ గ్రంథము తనయేలికయైన విజయరాఘవ నాయకునిపై వ్రాయబడినది. రెండవది హరివంశాంతర్గతమైన యుషాపరిణయగాథ. ఈ రెండు ప్రబంధములను జదివిన వారికి మొదటిదానికంటె రెండవది మిన్న యని కన్పట్టక మానదు. కథాసంవిధానమందును, కవితా పటిమయందును, శైలిరీతియందును నీ రెండవది తెలుగున గల గొప్ప ప్రబంధములతో సరియని చెప్పుట నిజము చెప్పుట యగును." "ఈ గ్రంథము కనుపర్తి యబ్బయామాత్యునికి పూర్వము వ్రాయబడియుండి, యబ్బయామాత్యుని 'యనిరుద్ధ చరిత్ర'కంటె సర్వవిధముల మేలని చెప్పుటకు దగినదై యున్నది."

మన్నారు దాస విలాసనాటక మప్పటి యక్షగాన రచనలలో ప్రసిద్ధికెక్కినది. యక్షగాన ప్రకరణమున నీనాటక విషయము విచారింతము.

తంజావూరు సంస్థానాశ్రితుండు గాకపోయినను విజయరాఘవునకు సమకాలికుండగుటచేత నవరము చిననారాయణరాజును ఇచట ప్రస్తావించుట యుచితము. ఇతండు చెంజి రాజా కుటుంబమునకు సంబంధించినవాడు గావచ్చునని ఇంతకుపూర్వ మూహించితిని. చిన నారాయణ కవి కువలయాశ్వ చరిత్రమను రసవత్తరము కావ్యమును రచియించి తన పెంపుడు తండ్రియైన నారాయణభూపాలున కంకితమిచ్చెను. ఇతండు మహాకవి. నాయక యుగంపు పింగళి సూరన్న యని చెప్పవచ్చును. కొన్ని విషయములం దితండు సూరన్నను మించిన ట్లగపడును. ప్రతిభావిశేషమునను గల్పనా సామర్థ్యమునను వీరిద్దరును సమానులే యైనను చిననారాయణరాజు కవిత్వమందలి శిల్ప పరిపక్వమును ప్రసన్నత్వమును, నిస్తుల సూరనార్యునందు గానరావు. సంస్కృత పాండిత్యము గలవాడైనను, సంస్కృత పదములను సమాసములను గుప్పిం

పక దాక్షిణాత్యాంధ్రకవులకు సామాన్యమైన తియ్యని తేట తెనుఁగుమాటలను గూర్చి హృద్యమైన పద్యములతో నెల్లవారికి సులభగ్రాహ్యముగ గ్రంథమును రచించినాఁడు. చేమకూర వాని భావగాంభీర్యమును చమత్కార నైపుణియు నితని కతీతములే, కాని పద సుంఘటనయందును వర్ణనాకౌశల్యమునను నతనికి సమానుఁ డని చెప్పవచ్చును. ఇతని కవిత్వ విశేషమునుగూర్చి వ్రాయవలసిన సంగతియు కలదు, కాని సమయము చాలదు.

విజయరాఘవునితోఁ దంజావూరు నాయక రాజ్యము సమసిపోయినది. మొదట నది మధుర నాయకులవశ మాయెను, కాని యటుపిమ్మట స్వల్ప కాలముననె శహాజీపుత్రుఁడు ఏకోజీవారిని జయించి మహారాష్ట్ర ప్రభుత్వము నెలకొల్పెను. అంతట నాంధ్రుల యధికార మచట నణగిపోయినది, కాని యాంధ్రభారతి మునుపటికంటె నధికతరముగ బ్రబలినది. ఇందుకు కారణ మేమన మహారాష్ట్రు లాంధ్రులను జయించి తమ ప్రభుత్వమును స్థాపించినను, ఆంధ్రులచే వారును బరాభూతులైరి. మహారాష్ట్రుల విజయము రాజకీయము, ఆంధ్రవిజయము సాంస్కృతికము. తంజావూ రాంధ్ర నాయక ప్రభుత్వము ఫల రహితమై పోలేదు. వారి నాశ్రయించుకొని యుండిన తెనుఁగు ప్రజయందు స్థిరముగ నిలచిపోయినది. వారి ముద్ర లేక నాగరకతకు జెలామణి లేకపోయినది, వారి జీవితప్రకార మందఱకు మేలుబంతి యైనది. విజ్ఞానమునకు వారు పెట్టినదే భిక్ష, కళాకౌశలమున వారిదే మీఁదిచేయి. ఆంధ్రభాషాపరిచయము రసికతకు ముఖ్య చిహ్నము, ఆంధ్ర కవిత నొసటి మాణిక్యము. కావున మహారాష్ట్రరాజులందఱు తెనుఁగు నభ్యసించిరి, సభయందు తెనుగు మాటాడిరి, తెనుఁగు విద్వాంసులను కవులను గాంధర్వ విద్యా విశారదులను గాయన గాయనీ జనులను జేరదీసి నాయకరాజులవలె నాశ్రయ మొసఁగిరి. మహారాష్ట్రరాజు లాంధ్రమున గవన మల్లుటకు నేర్చి కావ్యములను నాటకములను రచించిరి. కాని పద్యప్రబంధ రచన సన్నగిలెను, ద్విపద కావ్యములును, యక్షగానములును దామర తంపరగ నభివృద్ధి నందెను. వీనిగూర్చి ప్రకరణాంతరమున విచారింతము.

విజయరాఘవుని యనంతరము, మధుర పుదుకోట సంస్థానములు ప్రబంధరచన కిరవు లాయెను. మధుర సంస్థానమునం దాంధ్ర సారస్వతమును నెలకొల్పిన వాఁడు ముద్దళగిరి. ఇతఁడు తిరుమల నాయకుని మనుమఁడు, క్రీ. శ. ౧౬౫౯ మొదలు ౧౬౮౨ వఱకు మధురరాజ్యమును పాలించిన చొక్కనాథ నాయకుని సవతి తమ్ముఁడు[2]. క్రీ. శ. ౧౬౭౩ వ సంవత్సరమున

---

2. సత్యనాథ అయ్యరుగారు అకారణ చొక్కనాథునికి పోలిచ్చి పెంచిన దాది కొడుకని వ్రాసిరి. (*History of the Nayaks of Madura, p. 165*) అతఁడు చొక్కనాథుని "మారు భాయి" అని తంజావూరి యాంధ్రవీరాజుల చరిత్రయందు కలదు. కాని సమకాలిక రచన యగు సర్వజ్ఞభాను నాంద్విసమున, "మేదినీవసుమతీరుచులు గొను ... ... నాథుంకు పినాక్కమాంబ యందు చొక్కనాథావనీపాలు లింగాంచికయందు ముద్దళగిరింద్ర," గాంచె నని యున్నది పుట. 41. శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రుల వారేలనో ముద్దళగిరిపై కనులెఱ్ఱజేసినారు. "ఇతఁడు ఒంకాలపు ... ... ... ... తంజావూరి కోట నాలుగు రోజులలో యేకోజీని నాలుగు కోటలలో తాను పడించినట్లు "పెద్దగిరి విజయము" అని గ్రంథం చెప్పించుకొన్నాడు. ఉత్కృష్టపు ... చాటించుకొన్నాడు. నాలుగు దిక్కులకూ నాలుగు ఉత్పలమాలలు పెట్టెని. మొత్తం పదకొండు ... ఉంచెని. గ్రంథం పెరిగిపోతుంది. కొంచెంకూడా ఉపహరించ లేను." అని వక్కాణించినారు...పుట ౧౬. అ. ... కొంచెము సందిమనస్కులై విచారించి యుండిన శాస్త్రులవారింత తీవ్రముగ నిగరిని నిరసించియుండరు. ముద్దళగిరిపై నాలుగు పద్యములను వ్రాయించిన తప్పేమి? అనునది ప్రథమమున విచారింపఁ దగిన విషయము. ఏకోజీ తంజావూరికోటను స్వాధీనపఱచుకొనిన పిమ్మటనై యుండినగుగదా. తిరువాడిపై యుండవలయును, అగుచో యేకోజీతో యుద్ధము సాగకముందే అతని నాలుగు దినములలో నోడించి నాడనని కల్పనా కథను గట్టిశాసనముల సేయబద్ధ విజయమును ప్రకటించుకొని యైన నుండవలయును; లేదని, తంజావూరిని యేకోజీ సాధించుటకు పూర్వ మొకసారి యెత్తివచ్చి యడగరించె బరాజితుఁడై మరలిపోయి యుండవలయును. రెండవపక్షమే సత్యమని నావిశ్వాసము. ఇది యెట్లుండినను సుప్రసిద్ధ వాఙ్మయ విమర్శకులని పేరందిన శాస్త్రులవారు ఆ యుత్పలమాలలను వ్రాసి ప్రకటింపకపోవుట యత్యంతము శోచనీయము. ఉత్పలమాలలను రచించినవారెవ్వరు? రచనా కాల మెప్పుడు? అందలి వృత్తాంతమెట్టిది? కవిత్వమేపాటిది? అను ప్రశ్నలు భాషాభిమానుల

చొక్కనాథ నాయకుఁడు విజయరాఘవుని వధించి తంజావూరి రాజ్యమును స్వాధీనపఱచుకొనిన పిమ్మట ముద్దళగరిని దానికి పాలకునిగ నియమించెను. అచట నళగరి కొంతకాలము నివసించి యా రాజ్యముపై నెత్తివచ్చిన మహారాష్ట్రులతో నొకటి రెండు పర్యాయములు పోరవలసి వచ్చెను. తంజాపురమున నున్నప్పుడె యతని కాంధ్రభారతి ప్రసన్నయాయెను. ఇతని పేర మూడు కృతులు వెలయుచున్నవి. "పెద్దళగిరి విజయము" ఇది మహారాష్ట్రి యేకోజీపై నీతడు వసిసిన విజయమును వర్ణించు ౫౦౦ చరణములు గల యుత్పల మాలిక. తంజావూరికోట నాలుగు దిక్కుల యందును చెక్కఁబడియున్నది. అప్రకటితము. ఇంత కంటె దీనినిగూర్చి చెప్పుటకు వలనుపడదు. రెండవది లింగనమఖి కామేశ్వర కవికృత సత్యభామా సాంత్వనము. ఇతనికి తిరుకామ కవి యని నామాంతరము గలదు.

"అనువుగ రుక్మిణీ పరిణయంబును
 మున్ వర్ణించి యార్యులౌ
ననఁ దనియించినావు మము
 నప్రతిమంబుగ నవ్యకావ్యమిం
పున రచియింపు మీ సొగసు
 పొడిమి మీఱఁగ సత్యభామ సాం
త్వనమన గప్పురంపు నలువన్
 గెలువన్ దిరు కామసత్కవీ."

యని కృతిపతి తన్ను సంబోధించినట్లు చెప్పుకొన్నాఁడు. ఈ యంశమే యీతనివచన దేను మహా

---

హృదయముల మొలకలెత్తును. పెద్దళగిరి విజయము చారిత్రకముగను నాస్త్రయవృష్టియందును ముఖ్యమైనది. భాషాభిమానులెవ్వరైనను దీని ప్రతిని వ్రాయించి ప్రచురింతురు గాక!

త్కవ్యములోని కడపటి పద్యమువలన విదితమగు చున్నది.

"వివిధ కళాకలాపఖని సెంగమ
 లింగమఖేంద్రు నాగస
త్కవి తిరుకామ కోవిద
 శిఖామణి ధీయుతు పాకవైరిలో
కవి కచ కల్పక స్తబక గంధ
 ధురంధర సూక్తి యుక్తి నా
సవునని మెచ్చనాపుల
 మహోత్సవమొనగ్చును నేటనాటలన్."

ఇది చొక్కనాథ నాయకున కంకిత మీయబడెను. తిరుకామ కవి మూడుతరముల మధుర నాయక రాజుల యాస్థానమందున్నను, చొక్కనాథ నాయకుని రాజ్యకాలమునందె గ్రంథరచనకు గడంగినట్లున్నది. ఇతఁడు వర్ణించిన రుక్మిణీపరిణయ కావ్య మిప్పటి వఱకు లభ్యము గాలేదు. సత్యభామా సాంత్వనము వంటివారి శృంగార గ్రంథములయందు సుప్రసిద్ధమై ప్రకటింపబడినది. ఇందలి కథ నరకాసురవధ. నాలు గాశ్వాసముల గ్రంథము. మొదటి యాశ్వాసము మధురా పురవర్ణన కృష్ణవర్ణనతో సమాప్తమగు చున్నది. ఇంద్రాగమనము నరకాసుర దుష్కృత్య వర్ణన, నరకాసురవధోద్యోగము, వసంతోత్సవము, సత్యాకృష్ణుల విహారము, యుద్ధప్రయాణము, సత్యభామ యుద్ధప్రేక్షణాపేక్ష, విన్నపాలు, ముడిపలుకు సంభాషణలతో రెండవ యాశ్వాసము ముగియుచున్నది. మూడవాశ్వాసమున కృష్ణుని విరహవేదన, ద్వారకయందు సత్యభామ ప్రయాణము, సత్య రాక వినితో మూడవ యాశ్వాస మంతయు నున్నది. యుద్ధవర్ణన, నరకాసురవధ, భూదేవి స్తోత్రము, షోడశ సహస్ర స్త్రీ వివాహము, సత్యభామకోపము, కృష్ణుఁడామెకు సాంత్వనము చేయుటతోఁ బ్రబంధము ముగియుచున్నది.

(శేషం)



# తొలకరి చినుకులు



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

అలరిన వేడ్కనిండు మన మాదట రాగ సమంచితమ్ముగా
తలిరు పదమ్ములుంచి జలదాళి పసిండి హొయల్ పయంటగా
దిలి తొగరుం జిగుర్చెదవి తిన్నన నొత్తి యొకింత దాచి, వే
వలి గదలన్ విలోలనయనమ్ముల విభ్రమ క్రమరేఖనై!

తొలకరి కార్మొయిల్ కొనల దూసిన నూత్న తమాల శాఖ రా
గలలితమూర్తియై, చనవుగా చిఱుగుమ్మను వంగి చూచె శీ
తల మృదు వాత పూర్వక సుధామధు ధారలు జాలువాఱె, బీ
టలు వడి మండిపోయిన యెడంద నవామృత సేచకమ్ముగా!

ఉన్నత పర్వతాగ్రముల, నుజ్జ్వలరమ్య హిరణ్య కందరా
సన్న పథాల దేలిన నిజాశయ భవ్యకళా విలాసముల్
క్రొన్నురువుల్ ఘటించి, తళుకుల్, మెలపుల్, వలపుల్, కలల్ ధునీ
సన్నుత వైఖరుల్ దొలయ సాగినవీ తొలుకారు ప్రొద్దులన్!

ఈ సుమకోమలాంగి విరియించిన కేశవినీలపాశమే
యాసలొ సుళ్లువెట్టు! సువిహాయస సౌధతలాగ్ర తత్పద
న్యాస విలాస మాధురు లనన్యముగా మధు రోమ లేచు; కా
నీ సుకుమార మోమొకద నేదొ విషాదనదమ్మొ క్రమ్మోసెజీన్!

చింపిరి జుత్తుపై చినుకు చిందులు ద్రొక్కఁగ పాత గట్టి మే
కంపిల వానలోనిలిచి, కానికినైయిటు యాచ్న వెట్టు నీ
పొంపొక యింతలేని పసిబోటియు, ప్రక్కన చిన్నితమ్ముడున్
సొంపులు వోవు నాకవిత సోయగమున్ హసియించినట్లవున్!

పడ పడ యెండల వంగురి,
వడ వడ వడగాలితెరల వడియనసువులే!
తొలకరి చినుకుల టపటప
గిలకొట్టె నెడంద బ్రతుకు క్రిందుల్ మీదుల్!!

---

చారిత్రిక పరిశోధనలు:

# అంధవరం తామ్రశాసనము



శ్రీ యన్. రమేశన్

అశోకుని సర్వసంగ పరిత్యాగానికి ఆస్పదమైన కళింగదేశంలో క్రీ॥ శ॥ 5వ శతాబ్దం మొదలు, 15వ శతాబ్దంవరకు, అవిచ్ఛిన్నంగా రాజవంశీయుల పరిపాలన జరిగింది. ఈ కళింగదేశం, ఉత్కళ రాష్ట్రంలో వున్న వైతరణీనది మొదలు, విశాఖజిల్లాలో గల వరహానదివరకు వ్యాపించింది. అంటే, మద్రాసురాష్ట్రంలో గల విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలు, ఒరిస్సాలో గల, గంజాంజిల్లా, పూర్వం కళింగదేశంగా పరిగణింపబడింది. పాండవులతో కాళింగులు యుద్ధం చేసినట్టు, భారతంలో కొన్ని ఘట్టాలవల్ల తెలుసుకోవచ్చును. రామాయణం అయోధ్యాకాండలో కూడా కాళింగుల ప్రసక్తి వుంది. "ప్లీని," "టాలమి" అనే ప్రాచీన యవనయాత్రికులు కూడా వారి రచనలలో కళింగదేశాన్ని గురించి ప్రస్తావించేరు. రఘువంశంలో కాళిదాసు కళింగ రాజుల రాజధానీనగరం సముద్రపుటొడ్డునవున్నట్టు చెప్పేడు. సముద్రగుప్తుని దిగ్విజయాలను మనసులో పెట్టుకుని, రఘువంశీయుల విజయపరంపరలను వైభవోపేతంగా కవితాధోరణిలో రఘువంశ కావ్యంగుండా, కాళిదాసు విశదీకరించేడు గనుక, అతను చెప్పిన యీవిషయానికి, చారిత్రకమైన ప్రాధాన్యం వుంది. దండి "దశకుమార చరిత్ర"లో, వసంతోత్సవ సమయంలో, కళింగరాజు, రేవు పట్టణసమీపంలో పట్టుబడ్డ ఉదంతాన్ని, ముచ్చటించేడు. పై నిదర్శనాలవల్ల, కళింగ దేశంయొక్క చరిత్ర అతిప్రాచీనమైనదని స్పష్టమవుతుంది. పూర్వ గంగరాజులు 5వ శతాబ్దం మొదలు క్రీ॥ శ॥ 1434వ సంవత్సరంవరకు, అనగా నాలుగవ భానుదేవుని కాలంవరకు, అవిచ్ఛిన్నంగా కళింగ దేశాన్ని పరిపాలించేరు. భానుదేవుని అనంతరం యీ రాజ్యం మంత్రుల హస్తగతం అయింది. అటు తరవాత, కళింగరాజ్యరమ, తురుష్కులకు తల ఒగ్గవలసి వచ్చింది.

ప్రాచీన హిందూదేశ చరిత్రలో యింత యెక్కువకాలం, ఎడతెగకుండా పరిపాలనచేసిన రాజవంశం మరొకటి లేదు. తరువాత వచ్చిన గంగరాజులలో, కొంతమంది "మహారాజాధిరాజ" "పరమభట్టారక" మొదలైన బిరుదులతో వ్యవహరించేరు. వీరు సామాన్యరాజులు కాక, సమ్రాట్టులని చెప్పడానికి కూడా అవకాశం వుంది. ముఖ్యంగా క్రీ॥ శ॥ 1077 నుంచి యీప్రాంతానికి అధినేతఅయిన అనంతవర్మ గంగచోళుడు 70 సంవత్సరాలపాటు, ఏకచ్ఛత్రాధిపత్యంగాను, వైభవోపేతంగాను, రాజ్యం చేసేడు. ఇతనికాలంలో కళింగ సామ్రాజ్యం బంగాళాదేశం నుండి గోదావరివరకు వ్యాపించింది. ఈ చక్రవర్తి ఉత్కళదేశాన్ని జయించి, కటకాన్ని తన రాజధానీ నగరంగా చేసుకున్నాడు. ఇదివరకెన్నడు ఎరుగనంతటి ఎక్కువగా కళింగదేశంలోని సర్వశక్తులను ఏకీకృతం చేసేడు. ఈ చక్రవర్తి జగన్నాథ క్షేత్రమందున్న శ్రీ జగన్నాథస్వామివారి ఆలయాన్ని నిర్మించేడు. ఇతను తమిళ చక్రవర్తిఅయిన కుళోత్తుంగచోళుని మనుమడు. ఈ తాతా మనుమలమధ్య పెనుప్రళయమైన సంఘర్షణ చెలరేగింది. తాతగారైన కుళోత్తుంగచోళుడు, అనంతవర్మ గంగచోళునిపైకి దండెత్తి వచ్చేడు. ఈ సంగతి "కళింగ తుప్పరణి" అనే గ్రంథంలో "జయగొండార" అనే తమిళ కవి చక్కగా వెలువరించేడు. ఈ గ్రంథం చరిత్రకు ఆధారంగా ఉపకరిస్తుంది. ఈ గంగచోళుని తండ్రి పేరు రాజరాజ. ఈయన తమిళరాజైన రాజేంద్రచోళుని కుమార్తె "రాజసుందరి" అనే ఆమెను వివాహం చేసుకున్నాడు. క్రీ॥ శ॥ 10, 11 శతాబ్దాలలో కాళింగులకు తమిళులకు పరస్పర వైజ్ఞానిక, వైవాహిక సంబంధాలుండేవి. ఈ విషయాన్ని సరిగా అర్థం చేసుకోలేని డాక్టరు మజుందారు వంటివారు, తరువాత వచ్చిన గంగరాజులు తమిళులని భ్రమపడ్డారు. కాని నేడు యీ భ్రమ తొలగిపోయింది. ఏది యేలాగున్నప్పటికీ, గంగరాజులపైని చోళుల ప్రభావం

క్కువగా వుండేదనిమాత్రం చెప్పక తప్పదు. కళింగ చక్రవర్తులు చోళుల బిరుదాల్ని అనుకరించేవారు. చోళులపక్కలో పేరు దేవాలయాలనుకూడా నిర్మించుకున్నారు. కళింగదేశంలో వున్న దేవాలయాలలోకల్లా ప్రాచీనతమమైనది శ్రీకాకుళం తాలూకా శ్రీ కూర్మమందున్న, "శ్రీ కూర్మనాథస్వామి"వారి ఆలయం. హిందూదేశంలోకల్లా కూర్మావతారాన్ని ఆరాధించడానికి ప్రతిష్ఠించబడిన దేవాలయం యిది ఒక్కటేనని చెప్పాలి. ముఖలింగంలో వున్న సోమేశ్వర, మధుకేశ్వర, అనియంక భీమేశ్వరాలయాలు కూడా చాలా ప్రాచీనమైనవే. ఒకానొకప్పుడు యీ ముఖలింగక్షేత్రం కళింగరాజులకు రాజధాని నగరమై వుండేదని విజ్ఞానవేత్తల అభిప్రాయం. ఈ ముఖలింగ క్షేత్రంలో కొన్నిటిని తమిళ రాజులు యీ ప్రాంతానికి వచ్చినప్పుడు చెక్కించి వుండవచ్చును.

మొదట పరిపాలించిన గంగవంశరాజులు, వారి రాజ్యకాలపరిమితిని సూచించే పద్ధతిలో ఒక విశిష్టత వుంది. అప్పటికి అమలులో వున్న శకాన్ని బట్టికాక, తూర్పు గంగరాజుల నిలుబడి కాలంనుంచి వాళ్ళ కాలాన్ని పరిగణించడం ప్రారంభించేవారు. "ప్రవర్ధమాన విజయ రాజ్య సంవత్సర", "గాంగేయ వంశ సంవత్సర" మొదలైన వివరాలు ప్రాచీన చరిత్రలో కనబడుతున్నాయి. అవి దీనిని ధృవపరుస్తాయి. గంగవంశీయుల కాలంనాటి తామ్రశాసనాలు, శిలాశాసనాలు. విస్తారంగా లభ్యమైనప్పటికీన్నీ, యీ గాంగేయశకం ఎప్పటినుంచి ప్రారంభమైనది అన్న విషయం సందిగ్ధంగానే వుండిపోయింది. పలువురు పరిశోధకులు, పలురకాలుగా యీ కాలాన్ని నిర్ణయిస్తున్నారు. డాక్టర్ సీవల్, డాక్టర్ బర్నల్, గంగవంశీయులు 9 వ శతాబ్దంనుంచీ పరిపాలన ప్రారంభించి వుంటారని ధృవపరిచేరు. డాక్టర్ ఫ్లీట్, వీరు క్రీ॥ శ॥ 481-634 సంవత్సరాలమధ్య పాలించి వుంటారని ఊహించేరు. శ్రీ వి. రామదాసు గంగ రాజులకాలాన్ని 4 వ శతాబ్దంవరకు వెనక్కి నెట్టేరు. ఆర్. డి. బెనర్జీ యీ గాంగేయులు 8 వ శతాబ్దం నుంచీ పరిపాలన ప్రారంభించి వుంటారని పేర్కొన్నారు. కాని ప్రొఫెసర్ గణ్టి సుబ్బారావుగారు యీ విషయాన్ని సమగ్రంగా పరిశీలించి, గంగవంశీయుల పరిపాలన క్రీ॥ శ॥ 494 నుంచి ప్రారంభమైనదని నిర్ధారణ చేసేరు. ఈ సిద్ధాంతం నేడు సర్వజనామోదాన్ని పొందుతున్నది. డాక్టర్ మజుందారుకూడా అతనితాలూకు "ప్రాచీన హిందూ దేశ చరిత్ర" అనే సరికొత్త ప్రచురణలో గంగ వంశీయుల కాలాన్ని క్రీ॥ శ॥ 496 వ సంవత్సరంగా నిర్ణయించేరు. ప్రస్తుతము లభ్యమైన యీ తామ్ర శాసనం గంగవంశీయుల కాలాన్ని నిర్ణయం చెయ్యడానికి చాలా వరకు ఉపకరిస్తుంది.

ఈ తామ్రశాసనం, మరి మూడు తామ్రశాసనాలతో పాటు, అంధవరం దగ్గరవున్న ఒక శిథిలదేవాలయంలో దొరికింది. ఈ అంధవరం అనే గ్రామం శ్రీకాకుళం తాలూకాలో వుంది. ఈ శాసనంయొక్క సరియైన ప్రతిబింబాన్ని యీ పత్రికలో ప్రచురిస్తున్నాను. ఇది, ఆంధ్ర కన్నడ లిపులమిళితమైన "వేంగి" లిపిలో వ్రాయబడింది భాషమాత్రం సంస్కృతమే. "తోటవాడ" అనే గ్రామాన్ని దానంచేసినసందర్భంలో యీ శాసనం వ్రాయించేరు. ఈనాడు పాలకొండ తాలూకాలోవున్న తోటవాడ గ్రామమే, నాటి, "తోటవాటక" అయివుంటుందని నా ఉద్దేశం. "అంధోరక"లో వున్న బ్రహ్మచారుల వినియోగార్థమై యీ తోటవాటక అనే గ్రామం సర్వమాన్యంగా, అంటే యేవిధమైన పన్నులతో నిమిత్తంలేకుండా యీయబడినట్టు యీశాసనంలో వుంది. ఈ తామ్రశాసనం దొరికిన అంధవరమే ఆనాడు "అంధోరక"గా వ్యవహరింపబడి వుంటుంది. గాంగశకం 133 వ సంవత్సరంలో "ఇంద్రవర్మ" అనే రాజుచేత, అతని మాతా పితల ఖ్యాతిని వ్యాపింపజేయుటకుగాను, గంగరాజులశకం 133 వ సంవత్సరంలో శ్రావణ బహుళ అమావాస్యనాడు సూర్య గ్రహణ సమయంలో యీ దానం చేసేరు. ఈ శాసనంలో గల విషయాల్ని యీ దిగువ వివరిస్తున్నాము.

ఈ శాసనం ఆఖరున, "అజ్ఞయాలిఖితం శ్రేష్ఠ ప్రభాకరేణ శాసనం. అని వుంది, ఈనాడు సర్కారు వారి ఫర్మానాలలో "బై ఆర్డర్" అని వ్రాసినట్టే ఆనాడు యీ శాసనంలో "అజ్ఞయాలిఖితం శ్రేష్ఠ ప్రభాకరేణ శాసనం" అని వ్రాసేరు. ఈనాటి శ్రీకాకుళం, పాలకొండ తాలూకాలను, ఆనాడు, "క్రోష్టుకవర్తిని"గా పరిగణించేవారు. 1200 సంవత్సరాలకు పూర్వం కూడా చెక్కుచెదరకుండా వ్యాకరణ విశేషాలతో సంస్కృత భాష ఏవిధంగా యీ ప్రాంతంలో ప్రచారంలో వుండేదో యీ శాసనం వల్ల సంస్కృత భాషాభిమానులకు సుబోధక మవుతుంది.





(మొదటి రేకు రెండవ ప్రక్క)

1. ఓం స్వస్తి సర్వర్తు సుఖరమణీయ ద్విజయా కళింగ నగరాత్ సకల భువననిర్మా
2. ణైకసూత్రధారస్య భగవతో గోకర్ణ స్వామి నశ్చరణ కమలయుగళ ప్రణామాత్
3. అపగత కలికళంక విసయ, నయ, సంపహాం ఆధారః స్వాసిధారా పరిస్పందా
4. ధిగత సకల కళింగాధిరాజ్య శ్చరు రుపనిరరంగ మేఖలావనితల ప్రవి
5. తత్త మలయశాః—అనేకాహవ సమర సంక్షోభ జనిత జయశబ్దో సంగాపలకు
6. లప్రతిష్టః ప్రతాపాది శయానామిత సమస్త సామంత మాడామణీ ప్రభామంజ

(రెండవ రేకు మొదటి ప్రక్క)

7. రీ పుంజరంజిత చరణః మాతాపిత్రు పాదానుధ్యాతః పరమమాహేశ్వరః శ్రీ మహా
8. రాజా యింద్రవర్మ క్రోష్టుకవ ర్తన్యం తోటవటక గ్రామే సర్వసమవేతాం కుటుంబినః
9. సమాజ్ఞాప యతి—విదితం అస్తుయథాయ గ్రామేస్మాభిః సర్వకరైః పం
10. హృత్య ఆచంద్రార్క ప్రతిష్టాం అగ్రహారం కృత్వా మాతృపిత్రు ఆత్మనశ్చపుణ్య
11. యశసాం అభివృద్ధయే అంధోరకాగ్రహార వసతిభ్యాం నానాగోత్ర బ్రహ్మచర
12. ణ బ్రహ్మచారిభ్యః శ్రావణమాస అమావాస్యా ఆదిత్య గ్రహోపరాగే





(రెండవ రేకు రెండవ ప్రక్క)

13. ఉదకపూర్వం దత్తః భవిష్యద్రాజభిశ్చ అయం దానధర్మో అనుపాలనీయః తథాచ
14. వ్యాసగీతా శ్లోకాభవంతి బహుభిర్వసుధా దత్తా బహుభిశ్చాను పాలితా
15. యస్యయస్య యథాభూమిః తస్యతస్య తదాఫలం స్వదత్తాం పరదత్తాం వా
16. యత్నాత్ రక్షయుధిష్ఠిర మహీం మహిమతాం శ్రేష్ఠః దానాత్ శ్రేయోనుపాలనం
17. షష్టింవర్ష సహస్రాణి మోదతే దివిభూమిదః, ఆక్షేప్తాచాను మంతాచ

(మూడవ రేకు మొదటి ప్రక్క)

18. తాన్యేవ నరకేవసేదితి—శ్రీ ప్రవర్ధమాన తుమ్ము్రగు వంశరాజ్య సంవత్సరా
19. ణాం శతేత్రిం శత్రయ్యధికే సంవత్సరః శ్రావణమాస అమావాస్యాది
20. నానిచ—నిహ్నుంతు భర్తృగో విప్రబాలయోగీ విపశ్చితాం యోగతిః సాభ
21. వేత్ భూమిపాలక శాసనాధృతం—యథా అప్సుపతితాం శక్ర! తైలబిందు విసర్పతి
22. ఏవం భూమికృతం దానం సస్యేసస్యే విసర్పతి, శ్రీ లోకానాం దేవదేవస్య
23. లిఖితానేక విద్విషః ఆజ్ఞయాలిఖితం శ్రేష్ఠ ప్రభాకరేణ శాసనం.

ఖగోళ శాస్త్రరీత్యా సూర్యగ్రహణం సంభవించిన శ్రావణ బహుళ అమావాస్య అని తెలిసినంత మాత్రాన మనం ఒక సంవత్సరం యిదమిత్థం అని నిర్ణయించడానికి వీల్లేదు. కాని దీనికి సంబంధించిన మరికొంత పూర్వచరిత్రతో యీ శాసనాన్ని సమన్వయించి చూచినట్లయితే, ఒక నిర్ధారణకు రావడానికి అవకాశంవుంటుంది. ఈ శాసనం వ్రాయించిన రాజు గాంగ శకం 127 వ సంవత్సరంలో మార్గశిర శుద్ధ పౌర్ణమినాడు గోచరమైన చంద్రగ్రహణాన్ని వేరొకచోట పేర్కొన్నట్టు, డాక్టర్ సీవెల్ రచించిన పురావస్తు పట్టిక (*List of Antiquities*) 22 వ పేజీలో 156 వ ఐటమ్‌వల్ల మనకు తెలుస్తున్నది. ఈ రెండు గ్రహణాలను ఆధారంగా చేసుకుంటే కాలనిర్ణయం చేయడానికి సావకాశంవుంది. సూర్యగ్రహణం సంభవించాలంటే సూర్యునకు "నోడ్స్" (*Nodes*) కు గల మధ్య దూరం 15 డిగ్రీలుకంటె తక్కువగాను, చంద్రగ్రహణమైతే "నోడ్సు" కు చంద్రునకు గల మధ్య దూరం 12 డిగ్రీలు కంటె తక్కువగాను వుండాలని శాస్త్రవేత్తలు చెబుతారు. "నోడ్స్" అంటే క్రాంతి వృత్తంతో చంద్రుని కక్ష్యను ఖండించే బిందువులని అర్థం. ఈ సూచనను ఆధారంగా చేసుకుని ఆరుసంవత్సరాల మధ్య కాలంలో ఎప్పుడు మార్గశిర శుద్ధ పౌర్ణమి చంద్రగ్రహణం, శ్రావణ బహుళ అమావాస్యకు సూర్యగ్రహణం గోచరమయినాయో నిర్ణయించగలిగితే యీ సమస్య పరిష్కృతమవుతుంది. గాంగ శకం 127 వ సంవత్సరంలో చంద్రగ్రహణం కలిగినట్టు పూర్వ చరిత్ర చెబుతుంది. గాంగ శకం 133 వ సంవత్సరంలో శ్రావణ బహుళ అమావాస్యనాడు సూర్యగ్రహణం సంభవించినట్టు యీ శాసనంవల్ల తెలుస్తున్నది. మార్గశిర శుద్ధ పౌర్ణమినాడు గోచరమైన చంద్రగ్రహణానంతరం సరిగ్గా ఆరుసంవత్సరాల కాలం తరువాత, శ్రావణ బహుళ అమావాస్యనాడు సూర్యగ్రహణం సంభవించిన సంవత్సరాన్ని లెక్కకట్టి, గాంగ శకాన్ని క్రీస్తు శకంలోకి మార్చినట్లయితే, యీ గ్రహణాలు క్రీ॥ శ॥ 561, 567 సంవత్సరాలలో సంభవించినట్టు తెలుస్తున్నది. చంద్రగ్రహణం గాంగ శకం 127 వ సంవత్సరంలో పట్టింది గనక, 561 సంవత్సరాలలో 127 సంవత్సరాలు కొట్టివేస్తే గాంగ శకం 434 వ సంవత్సరంలో ప్రారంభమై వుండాలని మనం తెలుసుకో వచ్చును.

ఇంతవరకు యీ వంశీయులవి మున్నై శాసనాలు బయటపడ్డాయి. గాంగ శకం 51 వ సంవత్సరంలో దేవేంద్రవర్మ వ్రాయించిన శాసనంలోను, గాం॥ శ॥ 221 సంవత్సరంలో నందవర్మ వ్రాయించిన శాసనంలోను, 306, 397 సంవత్సరాలలో దేవేంద్రవర్మ అనే పేరుగల యిద్దరు వేరువేరు వ్యక్తులు వ్రాయించిన శాసనాలలోను, ప్రస్తుత చర్చకు ఆధారభూతమై యింద్రవర్మ వ్రాయించిన శాసనాలలోను గ్రహణవిషయం ఉదాహరింపబడి వుంది. మిగిలిన శాసనాలలో గ్రహణవిషయికమైన సూచన కనపడదు. క్రీ॥ శ॥ 434 వ సంవత్సరంలోనే గాంగ శకం ప్రారంభమైనదని అంగీకరించి, పై శాసనాలను పర్యవేక్షించినట్లయితే, లెక్క ప్రకారము క్రీ॥ శ॥ 485, 588, 655, 740, 831 సంవత్సరాలలో తప్పకుండా సూర్యగ్రహణం సంభవించినట్టు మనకు తెలుస్తుంది. గంగ వంశ ప్రారంభాన్ని నిర్ధారణ చేయడానికి యితర పరిశోధకులు సూచించే సంవత్సరాలను ఆధారంగా చేసుకుని లెక్కకట్టినట్లయితే శాసనాలలో నిరూపించిన గ్రహణకాలం సరిగ్గా సరిపోవడం లేదు. అందుచేత క్రీ॥ శ॥ 434 వ సంవత్సరమే గంగ వంశ ప్రారంభ కాలంగా నిర్ణయించవలసి వుంది.

ఇదిగాక, డాక్టర్ కీల్‌హారన్, డాక్టర్ డూబ్రెయిల్ అనే చరిత్ర పరిశోధకుల ఊహలకు నేను సూచించిన యీ క్రీ॥ శ॥ 434 వ సంవత్సరం అనుగుణంగానే వుంది. గాంగ శకం 87—91 సంవత్సరాల మధ్య పాలించిన యింద్రవర్మ విష్ణుకుండిన వంశీయులైన యింద్రభట్టారకునితో యుద్ధం చేసినట్టున్నా, యీ విష్ణుకుండిన వంశస్థుడు క్రీ॥ శ॥ 500 మొదలు 530 వరకు పాలించినట్టున్నా ఆధారాలున్నాయి. గాంగ శకం 87—91 సంవత్సరాలు క్రీ॥ శ॥ 500—530 సంవత్సరాలకు సరిపోవలసి వుంది. గంగ వంశీయుల ప్రారంభ కాలం 413—443 లోపున అయినప్పుడే పై విధంగా సరిపోతుంది. నేను సూచించిన క్రీ॥ శ॥ 434 వ సంవత్సరం యీ రెండు సంవత్సరాల మధ్యనే వుంది. కాబట్టి గాంగ శకం క్రీ॥ శ॥ 434 వ సంవత్సరంలో ప్రారంభమైవుండాలి. ఖగోళ శాస్త్రరీత్యా నేను నిర్ధారణచేసిన యీ విషయాన్ని యిప్పుడు దొరికిన ఆంధవరం తామ్రశాసనం పూర్తిగా బలపరుస్తున్నది.

(17-5-53 వ తేదీనాటి "హిందూ" పత్రికలో శ్రీ యన్. రమేశన్ గారు "*A. Kalinga grant*" అనే శీర్షికతో వ్రాసిన వ్యాసానికి యిది అనువాదం (అనువాదకులు శ్రీ క్రొవ్విడి రామం.)

కథానిక :

# వెదుళ్ల పండగ



• శ్రీ కవికొండల వేంకటరావు

రోడ్డు కొకతట్టు ఎత్తైన మేడలు, ఒక తట్టు హరిజనవాడ, మధ్యను రోడ్డు, సిమెంటురోడ్డు! సిమెంటు రోడ్డంటే అదో జనప్రవాహం! అస్తమానం జనం నడుస్తూనే వుంటా. ఈ జనంతోపాటు లారీలు, బస్సులు, టాక్సీలు, బళ్లు, రిక్షాలు, ఒకటేమిటి? సమస్తం చైతన్యంతో ఒక పెద్ద ఊరేగింపులా నిరంతరం కనిపించకమానదు. అయితే నిలబాటుగన్న పురాతన తాటిచెట్లు, చింతచెట్లు, దగిసెన చెట్లు, మజ్జిచెట్లు కూడా రస్తాకిటూ అటూ చిరకాలంనుంచి వున్నవి అలాగేవున్నాయి. వాటిని చూచినప్పుడల్లా ఊరులేనితీరు, వాడలేని బీడు, చరిత్రాత్మకునకు తోచకపోవు. మఱెన్ని అక్కడక్కడ ఏనాటిదో ఒక జామితోట, ఏ ప్రక్కనో ఒక జొన్నచేను ఇలాంటివి అనాది మనిషి సేద్యంచేస్తూ రాగా మిగిలిన భవ్యకళను ప్రసాదిస్తూవుండేవి.

ఎంత వ్యాపించుకుంటూ ఆక్రమించుకుపోతూవున్నా మనిషికి మానన్నా, మానుకు మనిషన్నా ప్రేమ! ఒక పట్టాన చెట్టును కొట్టెయ్యలేడు. కొట్టేసి ఇల్లు కట్టినా మళ్లీ అతగాడు పెరడనీ, కొరడనీ పెంచి, పాదో ఫలవృక్షమో మొలిపించుకు పచ్చందనం పెంపొందించేను గాని కేవలం నిప్పురుగాను, నిప్పచ్చరంగాను ఉంచనొల్లడు.

అసలు ఇల్లు లేకుండా, వెల్లడినిండు కుంచె కూడదని అనుకునే వాళ్ళూవున్నారు. చుక్కల్ని చూస్తూ, చంద్రుణ్ణి తలపోస్తూ, చల్లగాలిని పీలుస్తూ, ఎండకు చెమటోసుకుంటూ, వానకు మట్టి జార్చుకుంటూ, పారవశ్యంగంటూ, వింటూ అంటూ, ఎందుకుండకూడదు మానవుడుకూడాను? మనిషి తాను పిట్టకన్న, పెట్టకన్న, చెట్టుకన్న, చేమకన్న అధికుణ్ణని అనుకోడం చెల్లదేమో!

ఇలాంటి స్వప్నం అనుభవిస్తూ నిరుపేదల్లోని నిరుపేదై నిక్షేపంగా, తన నీడే తనకు జ్యోతిగా దాపుములేని జీవితాన్ని గడిపే వాడొకడున్నాడీ లోకంలో, గడప లేక, గరణలేక! అతని పేరు శరణయ్య!— శరణయ్య అంటే జ్ఞాపకం వస్తూవుంది. "ధర్మం శరణంగచ్ఛామి! సంఘం శరణం గచ్ఛామి! బుద్ధం శరణం గచ్ఛామి!—" కాని శరణయ్య బౌద్ధమత సన్యాసి కాడు. అద్వైతసన్యాసి అంతకన్నా కాడు. అసలు ఏ సన్యాసీ కాడు తన నీడే తన జ్యోతిగా, దాపుడులేని జీవితాన్ని గడిపే వాకానొక ఉత్తమ మనుష్యుడు. మగవాడు. ఎదిగిన వాడు. ఎఱ్ఱగావుంటాడు. బలంగా వుంటాడు. ఛాతీ పోలీసువ్యోగానికి సరిగా ఉంటుంది. ఎత్తు అలాంటిదే కాని ఎప్పుడూ నిద్రమత్తే ఆ వ్యక్తికి. ఆలిలేదు. అనురాగం లేదు. బాలబాలికలంటే పడదు. పశుపక్ష్యాదులన్నా తద్వతే!

అయితే అతనికి ఆకలితీరడ మేలాగు? కాలంగడవడ మేలాగు? అవి రెండూకూడా అతగాడి కెన్నడూ సమస్యలుగా దట్టలేదు. తాతతండ్రులు సంపాదించిన కొండ్ర కొంత వుంది.

ఏపూర్వులో వేసిన చెట్లయ్యుంటాయి అవి. కాకుంటే వాటికవి మొల్చినవయ్యుంటాయి. తాటివనం అదీ కొంతవుంది. మళ్లీ వాక ముంజెకాయ తినడు. బుర్ర గుంజు ఇంత కొట్టుకోడు. మనము రోడ్డంట నరమానవుల్ని ఏలా తప్పుకుంటూపోతామో, అలా చెట్టుచెట్టూ తప్పుకుంటూ వనమంతా తిరుగుతూ ఎక్కడో ఒకచోట ఏ రయితో ఇన్ని పచ్చికాయలుగాని, పచ్చి బియ్యము గాని, పచ్చిపప్పుగాని ఆఖరకు వట్టిన్నప్పైనా సరే, ఫలహారంగా పెడితే దాన పొట్టనింపుకొంటూ, చేరువనేవున్న నదిలో స్నానం చేస్తూ, సర్వవిధాలా సంతోషం అనగా వేడుకచే కలిగే సంతోషంకాదు, తృప్తిచే కలిగే సంతోషం పొందేవాడు. "తాతతండ్రులిచ్చిన కొండ్ర లేకుంటే?" అని అడిగారా పాఠకులు, అది వేరేచోట అడగవలసింది. శరణయ్యవున్న స్థలంలో కాదు... నిజం నిజంగా చెప్పుకోవాలిగాని, అలాఅయివుంటేనో, ఇలా అయివుంటేనో అని అనుకోరాదు. ఇంతకూ బాగా ఆలోచిస్తే అతనికాచెట్లు, పగటివేళ నీడను, రాత్రివేళ అంధకారాన్ని ఇచ్చేవి. అంతకు మినహా మరేమి యివ్వవు. మరేమీ కావుకూడాను.

ఇలా వుంటూవుండగా ఒక రోజున హఠాత్తుగా ఆ వూళ్లో వాళ్లకు వెదుళ్ళ పండుగ వచ్చింది. ఎన్ని పండగలైనా మనం ఎఱుగుదుం గాని వెదుళ్ళపండగ ఆ వఱకెఱుగము మనమెవళ్లమూను. తోళ్లిక్కడను గురించి వినేం! నక్షత్రాల్లె వెధవ అని తిట్టేం! కాని వెదుళ్లకు వెదుళ్లు, వరదలోపట్టి, ఇవలకు లాగి, బుజాన్ని వేసుకుని ఎవరికివారు చిరునవ్వుతో తీసికొనిపోవడం ఎప్పుడూ ఇదివరలో వినలేదు! కనలేదు! ఈ సాహసం అంతా చూచినప్పుడు శరణయ్యకే సాయపడాలని బుద్ధిపుట్టాక ఇతరుల మాట ఇక చెప్పాలా?

అసలు చాలా కాలాన్నుంచి నది ఇగుర్చుకు ఇగుర్చుకుపోతూ ఇసక మాత్రంగా ఇనుకూటగా కొంచెంకొంచెం ఉన్నానంటూ వుండే సందర్భంలో ఓ చీకటి రాత్రి గడవకుండానే అంతా జలమయమై పూరుకుంది. తెల్లారిగట్ల స్నానానికి అదివరలో కెంతో దూరం పోయేవాళ్లు, అసలే నడవక్కరలేకుండా కాళ్ల దగ్గరకు నీళ్ళొచ్చిపడ్డాయి. లంకలూ లేవు. లాకులూ లేవు. అంతా ఒకటే పొర్లువొర్లు. 'గాలపు' గుఱ్ఱు నురుగులు గ్రక్కేటట్టు నీరు ప్రాణం దాల్చి నురుగు గ్రక్కుతూ, బరువు వస్తువును తేలిక వస్తువుగాను, తేలిక వస్తువును బరువు వస్తువుగాను చూపిస్తూ ఒకటే శోభ, క్షోభ ఇద్దరినుంచి అద్దరిదాకా కాపరుస్తూవుంది అందులోనే చిత్రం!

తెప్పలకు తెప్పలే, కుప్పలకు కుప్పలే, వెదుళ్లు కట్లు తెగి, కలప పట్లు తప్పి, పలకలు కూడా పోలికలా అన్నంత వేగంగా విడివడ్డాయి. పట్టువడ్డానికి బిడ్డా? కరగి పోవడానికి బెడ్డా? దేనికదే అడ్డదిడ్డపు గామ్యారాన్ని రాత్రి చీకటి గుయ్యారం అంతా గడపి తెల్లారి వెలుగులో పట్నప్రజకళ్లల్లో పడ్డాయి వాళ్ల కాళ్లల్లో నిలబడ్డాయి. పట్టి పైకి తెస్తారా పట్టవే సముద్రానికంటూ పోనిస్తారా? ఆ తేలేకత్రనూ? ఆ మెదిలే కలపను? ఇల్లులేనివాడు సుందరంగా ఇల్లు కట్టొచ్చునని, పెళ్లిచేసుకునేవాడు పందిరి వేసుకోవచ్చునని, పీటదూకి, నురుగునూకి ప్రతీవాడు ఆ రోజున "వెదుళ్ల పండగ" "వెదుళ్ల పండుగ" అంటూ ఒళ్లుమఱచి సంచరించిన వాడే. ప్రతి ఆడదీ ఆయా మగాడికి తోడ్పాటైందే.

శరణయ్య మాత్రం కొంతసేపు విస్తుపోతూ చూశాడు! చూసిచూసి అన్నాడు- "వెదురైతే పట్టేరు. కలపైతే పోగెట్టేరు! స్థలం మీకెక్కడ?" అని అడిగాడు.

ఆలా అడుగుతూనే వున్నాడు శరణయ్య, శరణయ్య చరణాల క్రిందకు వఱద వచ్చి అరికాలు గోగినట్టు అయింది శరణయ్య ఒహా దొడ్డ నవ్వునవ్వి అనుగు మార్చాడు. మార్చాడో లేదో ఒకసాటుచు కుఱ్ఱది, అంతా బాగా వున్నది- "ఒయ్యో ఖు! సి వెనగనో? జరగబోక! కుపింగి ఈ వెదురు నిక్కు జేశేసేప!" అని ఓ వెదురుగడ జారే శరణయ్యకు దాపెట్టిని తేసింది. మొదటి వెదురుకు రెండో వెదురు కలేసింది. రెండో వెదురుకు మూడో వెదురు, ఆలా పేర్చి, "శివాశివా! యిదేంపాపం?" అని శరణయ్య అనుకునేలా ఆదించింది వెదుళ్లతో శరణయ్యను, శరపరంపరగా, అణచేసింది "ఇక చాలు" అన్నా వినిపించుకునే వాటంలో లేదు అది. ఒక్క గడనూ కూడా వాలుకు పోనీక, తేల్చిలాగి, శరణయ్య మీదకి విసరజొచ్చింది. శరణయ్య మఱి చేసేపనిలేక తనమీదకొరగిన గడలను ఆలా తన తాటి వనంలో ఓ తాటిచెట్టుకు జేరవేసేడు. ఆ పిల్ల ఊరికే వెదురు గడలను అందివ్వడం, ఇతడూరికే తాడికి జేరెయ్యడం! ఇలా కొన్ని గంటలు వాదూ, వాక్యం మాని ఆ యిద్దరూ గోదావరి ప్రవాహం మధ్యను ఈదులాడినంత శ్రమపడి, యెట్ట

కేలకుమట్టమధ్యాహ్నానకు "ఏం, మావా!" అని అది, "ఏం కోడలా?" అని శరణయ్య ఒకర్నొకరు చూచుకొన్నారు.

చూచుకోవడంలో పూచిన చెట్టులా అది పీనికితోచింది. ఆ మెకు ఇతడు ఏలాగో తట్టేడు. ఏలాగేమిటి? శరణయ్య లాగేను. "ఏం శరణయ్యమావా! నీవే! ఇంగాకట్నుంచీ వెదుళ్లిందుకున్నాది?" అని, ఏమీ ఎఱగని దానిలా, అడిగింది. శరణయ్య ఆ ఆడమనిషిని పునః పునః పరకాయించి, "చూస్తే పిల్లవుగాని మాట్లాడితే ఇల్లాలు లాగు పలకరించేవు! నీ వెదుళ్లలా నా తాడికి జేరమోసి అలా వుండవలసిందేనా ఈపైని?" అని అడిగేడు "స్థలం మరెక్కడన్నా దొరికేదాకా అలా ఉండవలసినవే అవి" అని పిల్ల అంది.

శరణయ్య కెక్కడలేని కోపం ఆవేశంగా వచ్చి, ఒక గొడ్డలి తెచ్చి, ఒక్కొక్క తాడిచెట్టే నఱక జొచ్చాడు. అతగాని వూహ "ఆ పిల్లకు వెదురు జేరేసేందుకు చోటులేకుండ చేదా"మని. గొడ్డలిదెబ్బకు— ఒక్కొక్క దెబ్బకు – పై మట్ట అల్లల్లాడి క్రింద వేరు చెదరి - ధడేల్మని - చప్పుడవుతూ వుంటే పిల్ల హడలిపోయింది. "భగవంతుడా! ఏ తాడిచెట్టుమీద పడుతుందా?" అని వణకిపోయింది. "శరణయ్యమావా! అంత కోపం అయితే ఏలా?" అంది. "చెట్టుకు జేరేసినగడ చెట్టుదే! నీవు ఈ స్థలం వదలి వెళ్ళిపో తత్క్షణం వెళ్ళిపో" అన్నాడు శరణయ్య.



పిల్ల తత్క్షణం వెళ్ళిపోయింది. "వెదురు దొంగవెదురు సుమా." అని పిక్కటిసింది. "దొంగవు నీవా? నేనా?" అంటూ శరణయ్య నీళ్లు నమలినట్టుఅని గొడ్డలెత్తలేకపోయినాడు. గొడ్డలి గడలకు జేరేసి తాటి మువ్వొంక ఒకసారి గాంచి "ఇది మా పెద్ద పన్నాగం పన్నేసింది! ఎవరా ఆ పిల్ల?" తెలుపినే తేరిపారిచూచాడు.

పిల్ల 'మరియమ్మ'లా పట్టింది, వెను తట్టు జటా అది, అల్లాడేలా, కుటకులాడుతూ నడుస్తూవుంది. "మరియమ్మా!" అని కేకేసేడు; తన అం చేతులు తననోటికి దాపినవాడై బూరా వూదినట్టు కూకేశాడు. "నన్నేనా? నాను రాను" అంది మరియమ్మ.

"ఎఱిగున్న మనిషే
మఱపు కొచ్చింది!
తిరిగి పోనాక మఱి
తెలివేల? కాల్చనా?"

అంటూ ఓగీతిక అల్లుకు శరణయ్య ఆ మరియమ్మను మరియాదగా వెంటాడించాడు మట్ట మధ్యాహ్నపు ఎండలో.

"కాపలాకాస్తే దొంగనరుకు కాకపోవచ్చు" అన్నాడు చెవిలో అన్నట్టు చేరికకు వెళ్లి. మరియమ్మ, మెలితిరిగినట్టు శరణయ్యవంకకు మెడత్రిప్పి, "నీవా? నేనా? కాపలాకాయడం?" అంది. "నరుకు నా వంతు, కాపలాకాయడం నీ వంతు" అన్నాడు. "అమ్మితే వచ్చేలాభం?" అని అడిగింది. "ఇదేం పెద్దవ్యాపారమా లాభా

నికి ?" అన్నాడు శరణయ్య. "వ్యాపారమో వ్యవహారమో నా కదంతా తెలియదు" అంది మరియమ్మ. "సాక్ష్యం మఱి వేరు" అన్నాడు శరణయ్య.

అంతలో వాళ్ళిద్దఱూ నిలబడ్డ చాయనే వాళ్లున్న పాళంగా వాళ్ల మీదకు తభీమని ఒక తాడిచెట్టు వొరిగింది. ఇద్దరూ చెరోవైపునకు తప్పుకున్నారు. తప్పుకున్నట్టుగా, మరో తాడి, మరో తాడి తభీ తభీమని గొడ్డలిపెట్టున పెటిల్లుమంటూ మఱీ మీదకు పడసాగాయి. చుట్టూ చూచేరు శరణయ్య మరియమ్మ ఏకచూపుగా! శరణయ్య గొడ్డలివేయి గొడ్డళ్లై, చెట్టుకో గొడ్డలి, గొడ్డలికో మనిషి నిలబడ్డారు కోర మీసాలు వడేశారు.

శరణయ్య మరియమ్మకేసి, మరియమ్మ శరణయ్యకేసి, ఒండొరులు భయకంపనంగా చూచుకొన్నవారై, మఱికొట్టబడని చెట్టు ఆ వెదుళ్లుదాపెట్టిన చెట్టేనని తెలుసుకోగలిగారు. ఇద్దఱూకూడా వెదుళ్లమధ్యకు దూఱి ఆ ఒంటితాడి మొదలున కూర్చున్నారు.

"బయటికి రాండి!"అని కులంవారు అంతా కూడకట్టు కొక్క గొంతుకసరిస్తే, మరియమ్మ మఱితపడ్డ జడరిబ్బను సరిచేసుకుంటూ యివతలకు వచ్చింది. కాని శరణయ్య అలాగే తాటి నంటిపెట్టుకుపోయాడు. గడలన్నీ వొత్తిగించి యివతల పారేసినా, చెట్టును విడువకుండా శరణయ్య పూర్ణ సంతోషం వెలిబుచ్చాడు.

"మీరా తాళ్లు ఇంకా వాసాలుగా చేసుకోండి! ఆ స్థలంలో ఇళ్లేసుకోండి! ఆ వెదురంతా పెండెంక్రింద పెణక్రింద ఉపయోగించుకోండి! నన్నూ నా పురాతనపు తాడిచెట్టును ఇలా వుణ్ణియ్యండి!" అన్నాడు.

ప్రజలప్పుడు తాముకట్టిన వెదురుంచుకోవడానికి జాగానేకాకుండ, ఇల్లుకట్టుకోనడానికికూడా జాగా సంపాదించుకున్నవారయ్యారు. అదంతా వేటే ఒక పెద్దపేటగా తయారై యూరుకొంది ఒకలిస్తలో.

మఱెప్పుడన్నా మరియమ్మను శరణయ్య చూచినప్పుడు, తొల్లింటికోపం పాపం అంతా మఱచిపోయి— "మరియమ్మా! మనిషికి ఒక తాడిచెట్టు ఒక్క వెదురుబొంగు ఉంటేశాన! నీ వంత పెద్దలోగిలెందుకట్టేవు? అన్ని వెదుళ్లెందుకు నెట్టేశేవు?" అనీ వాడు యథాలాపంగా! మరియమ్మ అతగాడి ఆ తాడిచెట్టు మువ్వంక చూస్తూ "వెదుళ్ల పండగ!" అని చిరునవ్వు నవ్వేది!



**విజ్ఞాన విశేషాలు :**

# గతంలోనికి ప్రయాణం



శ్రీ వసంతరావు వేంకటరావు

సూర్యో మరీచి మాదత్తె
సర్వస్మా ద్భువనాదధి।
తస్యాః పాక విశేషేణ
స్మృతం కాల విశేషణం॥
నదీవ ప్రభవాత్కాచిత్
అక్షయ్యా త్స్యన్దతే యథా।
తాం నద్యోభి సమాయన్తి
సోరున్స తీన నివర్తతే॥
ఏవం నానా సముత్థానాః
కాలా స్సంవత్సరగ్గ్ శ్రితాః।
అణుశ్చ మహాశ్చ
సర్వే సమ వయన్త్రితం॥
సతై స్సర్వై స్సమావిశ్చః
ఊరున్స న్నవివర్తతే।
అధిసంవత్సరం విద్యాత్
తదేవ లక్షణే॥
అణుభిశ్చ మహద్భిశ్చ
సమారూఢః ప్రదృశ్యతే।
సంవత్సరః ప్రత్యక్షేణ
......................॥

'సూర్యుడు సర్వప్రపంచమునకు పైభాగమందుండి కిరణములను సరించి ప్రకాశింపజేయుచున్నాడు. సూర్యునియొక్క ఆ కిరణముల ప్రకాశమువలనను సంకోచమువలనను సంవత్సరము, అయనము, ఋతువు, మాసము, పక్షము, దినము మొదలగు కాలభేదము లేర్పడియున్నవి. మరియు, విత్తనములు మొలచుట, పెరగుట, వృక్షములగుట, పుష్పించుట, ఫలించుట మొదలగునవి అన్నియును సూర్యుని కిరణప్రకాశ పరిపాకమువలననే గలుగుచున్నవి. అనేకములైన చిన్న నదులు కలియుటచేత గొప్పదియగుచు నెల్లప్పుడు నెడతెగక పారుచుండెడి ప్రవాహము కలదియై, నాశనములేనిదియగుచు మహానది యెట్లలగునో, ఆప్రకారముగానే క్షణముహూర్తాదిరూపమైన చిన్న కాలములు, దివసపక్షాది రూపమైన మహాకాలములను ఏవి కలవో అవి అన్నియు సంవత్సరమునాశ్రయించి మహాకాలముగా జెప్పబడుచున్నవి. ఆ సంవత్సరము అణువు మొదలుగా గల సమస్త అవయవములతో గూడినదై, గొప్పదియగుచు, నెప్పుడు విరామమును బొందదు. ప్రభవ విభవాది సంవత్సరరూపముగా ప్రవర్తించుచునే యుండును. ఆ హేతువువలన సమస్తమైన ప్రపంచము సంవత్సరము నాశ్రయించి యున్నది. కావున కాలస్వరూపమును దెలిసికొనినయెడల సంవత్సరస్వరూపము తెలియబడుచున్నది. క్షణము మొదలగు స్వల్పకాలములచేత, దివసము మొదలగు మహాకాలములచేత నేర్పడియున్న ప్రభవాది సంవత్సరములు అందరకును తెలియబడుచునే ఉన్నవి" అని అరుణంలో కాలజ్ఞాన చర్చ గావింపబడింది. శివసహస్రనామావళిలో 'కలాకాష్ఠా లవామాత్రా ముహూర్తాహ క్షపాక్షణా' అని శివుని సంబోధించేరు. ఆ ఎనిమిదిన్నీ కాలవిభాగాలు. ఒక మతప్రకారంగా వాటి విలువలు :

| | |
|---|---|
| కల | = 30 కాష్ఠలు = 8 సెకనులు |
| కాష్ఠ | = 8/30 సెకెను |
| లవము | = ½ సెకను |
| క్షణము | = 4/5 సెకెను |
| మాత్ర | = ఒక అచ్చును పలుకుటకు పట్టుకాలము |
| ముహూర్తము | = 48 నిమిషాలు |
| క్షప | = రాత్రి = 12 గంటలు |
| అహస్సు | = పగలు = 12 గంటలు |

ఈవిధంగా భగవంతుడు కాలస్వరూపుడన్నారు మన ప్రాచీనులు. ఒక్క కాలపరంగానే కాకుండా 'దేశకాలాపరిచ్ఛిన్నా' అనికూడా సంబోధించేరు.

అయితే, కాలభావ మెట్లు కలుగుతూంది? ఒక సమగతికగమనమో, ఆవర్తచలనమో కాలభావానికి అత్యంతావశ్యకం. అనేక దోలకంయొక్క ఊగుడు కావచ్చు, భూమియొక్క అంతిర్భ్రమణం కావచ్చు, లేదా సూర్యునిచుట్టూ భూమిచేయు పరిభ్రమణం కావచ్చు, లేదా జీవి గుండెయొక్క పోటుకావచ్చు; వీటిలో దేనినైనా కాలాన్ని కొలవడాని కుపయోగింపగలం. ఏదో వస్తువుయొక్క గమనపరంగా గాని కాలాన్ని ఊహించలేము. గమనరహితమై వస్తువులు స్తంభిస్తే కాలభావం మాయంగాక తప్పదు.

సర్వ్యజీవితంలో ప్రాథమికమైన కాలప్రమాణాలు మన భూగమనంవల్లనే ఏర్పడ్డాయి. తనఅక్షంపై భూమి భ్రమిస్తుండుటచేత మనకు రాత్రింబవళ్లు కలుగుతున్నాయి. ఒకసారి మనభూమి ఆత్మప్రదక్షిణం చేయడానికి పట్టుకాలాన్ని 'దిన' మని వ్యవహరిస్తున్నాము; సూర్యునిచుట్టు ఒక ప్రదక్షిణం చేయడానికయ్యేకాలాన్ని 'సంవత్సర' మన్నాము. ఒకవేళ భూమి ఆత్మప్రదక్షిణం చేయడం మానినట్లయితే మన దినప్రమాణం సంవత్సరప్రమాణానికి సమానమౌతుంది. ఆత్మప్రదక్షిణకాలం సూర్యప్రదక్షిణకాలానికి సమానమైతే, అంటే మనరోజు సంవత్సరానికి సమానమైతే భూగోళంలో అర్ధభాగం శాశ్వతంగా సూర్యునివైపు తిరిగి ఉండిపోతుంది; దానిఫలితమేమంటే, భూమిలో అర్ధభాగానికి నిత్యం పగలు, మిగిలిన సగానికి నిత్యం రాత్రి. పగటిభాగంలోనున్న వస్తువులు నిరంతర సూర్యరశ్మికి గురియై వాడి మాడిపోవచ్చు; రాత్రి భాగంలోనున్నవి తేజోష్ణాలు లేక కొంకుబారిపోవచ్చు! సూర్య ప్రదక్షిణాలు చేయడం మానినా భూమి కదే గతి పట్టుతుంది.

భూభ్రమణ పరిభ్రమణాలవల్ల మనకు దిన సంవత్సరాలు క్రమంగా కలుగుచుండగా, చంద్ర పరిభ్రమణంవల్ల 'మాస' భావం జనించింది. భూమి చుట్టూ చంద్రుడొక ప్రదక్షిణం చేయడానికయ్యేకాలం ఒకనెల. కాగా, మన సంవత్సరానికి సుమారు 12 చాంద్రమాన మాసాలు, మాసానికి 30 రోజులు, సంవత్సరానికి 365¼ రోజులు అను సంబంధాలేర్పడ్డాయి.

కాని, ఈ దిన-మాస-సంవత్సర సంబంధమే ప్రతిలోకానికి వర్తిస్తుందని చెప్పలేము. అది గ్రహం నుండి గ్రహానికి మారుతుంది. చంద్రగోళంలో జీవు లుంటే వారికి మాసభావమే కలిగే అవకాశంలేదు. చంద్రునిచుట్టూ తిరిగే ఉపగ్రహంలేదు. మన భూమినే వా రుపగ్రహంగా భావిస్తా రనుకొంటే చంద్రగోళంలో సగంభాగానికి భూమి కనిపించదు. భూమితోపాటు చంద్రుడు సంవత్సరాని కొకసారి సూర్యప్రదక్షిణం చేస్తాడు. ఆత్మప్రదక్షిణకాలం మన నెలకు సమానం; అది చంద్రలోకవాసుల కొక్క దినం. అందుచేత చంద్రలోకంలో సంవత్సరానికి 12 దినాలు; నెల లేనేలేదు.

కుజగ్రహంలో దినప్రమాణం మన దినప్రమాణం కంటె కొన్ని నిమిషా లెక్కువ. కాని కుజ సంవత్సరం మన సంవత్సరానికి సుమారు రెండురెట్లు. గురులోకంలో దినప్రమాణం మన 10 గంటలకే సమానం; సంవత్సరమాత్రం మన సంవత్సరానికి రమారమి 12 రెట్లు. గురునికి చాల ఉపగ్రహాలున్నాయి. వాటిలో దేనినిబట్టి వారు మాసం నిర్ణయించుకొంటారో చెప్పలేము. శనిలోక దినప్రమాణం మన పదిన్నరగంటలకు సమానము; శని సంవత్సరం మాత్రం మన 29 సంవత్సరాలంత దీర్ఘమైనది. శనికి చాల ఉపగ్రహాలున్నాయి. వాటి కనుగుణ్యంగా అనేకమాసాలుండవచ్చును. కాని, శని సంవత్సరానికి సుమారు 24000 శనిదినాలు. ఈవిధంగా ప్రతిగ్రహానికి ఉపగ్రహానికి ప్రత్యేకమైన కాలమానా లున్నాయి. ఇది భౌతిక కాలం.

భౌతికకాలాన్ని నాలుగుశాఖలుగా విభజించవచ్చు. అవి: సౌరకాలం (*Solar Time*) నక్షత్ర కాలం (*Sidereal Time*) ప్రమాణ కాలం (*Standard Time*) స్థానిక కాలం (*Local Time*) సౌరదినానికి నాక్షత్రదినానికి కొన్ని నిమిషాల వ్యత్యాసముంది. ఏ స్థలంలోనైనా సూర్యోదయ సూర్యాస్తమయాలకు సరిగా మధ్యనున్న కాలాన్ని 'మధ్యాహ్న' మన్నారు. భూమి ఆత్మప్రదక్షిణం చేస్తూండగా ఒక్కొక్క రేఖాంశ మధ్యాహ్న మార్తాండుని క్రిందికి క్రమంగా వస్తుంది. ఏదో ప్రదేశంలో ఎప్పుడూ మధ్యాహ్నమే; కాని, రెండురేఖాంశాలలో ఒకేసమయమందు మధ్యాహ్నం కాలేదు. ఒక డిగ్రీ రేఖాంశ భేదమున్న రెండుప్రదేశాలలో 4 నిమిషాల వ్యత్యాసంతో సూర్యోదయమౌతుంది. అందుచేత ప్రతిదేశం ప్రమాణకాలాన్ని, ప్రతిదేశం స్థానిక కాలాన్ని ఏర్పాటు చేసికొంటుంది. ఒకదినం



**మీరు ఖర్చుపెట్టిన**
**డబ్బుకు ఈవిధములుగా**
**డాల్డా వనస్పతి**
**పూర్తిగా లాభము**
**గలుగజేయును**

ప్రతిచోట స్త్రీలు చెప్తారు :
"డాల్డాను కొన్నారంటె మీరు
డబ్బును మిగిల్చుకొంటారు మరియు
ఇంక రుచికరమైన
ఆహారమును వండుతారు!"



తెలివైన ఇల్లాండ్లు ఎల్లప్పుడు డాల్డాను కొంటారు. మన ప్రతిదినపు ఆహారములో వంట క్రొవ్వుపదార్థము ఎప్పుడూ ఉండవలెనని డాక్టర్లు చెప్పుదురు. డాల్డా ఒక దివ్యమైన వంట క్రొవ్వు పదార్థము. దానివలన ఖర్చు తక్కువ. ఒక డాల్డా డబ్బా ఎంతకాలము వస్తుందో, దానితో ఎంత అద్భుతమైన ఆహారమును వండగలుగుదురో మీరే చూడండి. ఒక డాల్డా డబ్బాను ఈ రోజే కొనండి.

నేనేవిధముగా వంట విషయంలో ఖర్చును
తగ్గించుకోగలుగుతాను :
ఉచిత సలహాకు ఇప్పుడే ఏ రోజైనను ఈ క్రింది అడ్రసుకు
వ్రాయండి:
ది డాల్డా అడ్వైసరీ సర్వీస్
పోస్టు బాక్సు నంబరు 353, బొంబాయి 1

# డాల్డా

**10 పౌన్లు, 5 పౌన్లు, 2 పౌన్లు మరియు 1 పౌను టిన్నులలో దొరకును**




HVM. 192-50 TL

గ్రీన్విచ్చిలో మధ్యాహ్నమైనప్పుడు, భూభ్రమణ ఫలితంగా ఆదినం విశాఖపట్నంలో సాయంకాలం గం 5-33 లున్నూ, బొంబాయిలో సాయంకాలం గం 4-50 లున్నూ ఆయా ప్రదేశాల స్థానిక కాలప్రకారం అవుతుంది.

నోబెల్ బహుమానమందిన విజ్ఞాని ఎలెక్సిస్ కారెల్ ప్రకారము మన జీవప్రమాణాన్ని సౌర కాలంలో చెప్పుకొంటాము. సగటున మానవుడు 25000 రోజులు బ్రదుకుతాడు. దినాన్ని కొలిచే గడియారానికి అన్నిదినాలొక్కటే; వృద్ధుడు గడిపిన దినానికి పంటిపిల్ల గడిపినదినానికి వ్యత్యాసం లేదు. కాని, పిల్లయొక్క భవిష్యత్తులో ఈ 24 గంటలు చాల స్వల్పకాలాన్ని నిరూపిస్తాయి; వృద్ధుని జీవితంలోనైతే ఆదినం పెద్దకాలభాగమే. కాని, వృద్ధుని భూతకాలంతో పోల్చినప్పుడు ఆ దినం స్వల్పంగా కనిపిస్తుంది; పిల్లజీవితంలో చాల ముఖ్యంగా పరిగణించవచ్చు. ఈవిధంగా భౌతిక కాలంయొక్క విలువ మన దృష్టినిబట్టి మారుతుంది.

భౌతికమైన దేశకాలావిరతికం (*Space-time-Continuum*)లో మనం నివాసులమై యున్నాము. అందుచేత మన జీవితకాలాన్ని తెలిసికోడానికై గడియారాన్ని అర్థించాలి. ఈ అవిరతికంలో ఒక పరిమాణమైన కాలాన్ని గడియారం కొలుస్తుంది. దేశానికి భిన్నంగా నున్నప్పటికి కాలాన్ని దేశంనుండి వేరు తీయలేము.

మనమనస్సు పరిశీలించు వస్తువులనుబట్టి కాల స్వభావం మారుతుంది. ప్రకృతిలో మనం పరిగణించు కాలానికి ప్రత్యేకమైన మనుగడలేదు. గణితకాలాన్ని మనమే సృష్టిస్తాము. దాని నొక ఋజురేఖతో పోల్చి, ప్రతిక్రమాగత క్షణం ఆరేఖపై బిందువుగా భావిస్తాము. ఒకవస్తువుయొక్క గాని, జీవియొక్క గాని వివిధాంశలసమీకరణమే జీవప్రమాణమౌతుంది. అదొక విధమైన ఆంతరంగిక గమనము. చెట్టు పెరుగుతుంది, కాని వ్యక్తిత్వాన్ని కోల్పోదు. మానవుడు తన జీవితంలో అనేకవిధములైన దైహికవిపర్యయాలకు మానసిక ప్రక్రియలకు లోనైనప్పటికి తన వ్యక్తిత్వానికి భంగం కలుగదు. ప్రతివస్తువుకి, జీవికి, స్వతస్సిద్ధమైన ఆంతరంగిక గమనము, అవస్థాక్రమము, ఉండి తీరుతుంది. అట్టి గమనమే నైసర్గిక కాలము. మరొక వస్తు గమనంతో ఈ కాలాన్ని కొలవవచ్చును. అందుచేత సౌరకాలపరంగా మన జీవితప్రమాణాలని కొలుచుకొంటున్నాము. భూతలంపై మనం నివసించుచుండుటచేత భూమియొక్క దేశకాల పరిమాణాలు మనకు ప్రమాణాలైనాయి. భూమధ్యరేఖలో నిర్దిష్ట భాగమైన మీటరుతో మన పొడవు కొలుస్తాము. భూభ్రమణ కాలం 24 గంటలని, ఆ గంటలపరంగా మన జీవితకాలాన్ని చెప్పుకొంటాము.

ఒక మానవుని జీవితంలో శారీరకంగా కలుగు మార్పుల వివరణమే వాని ఆంతరిక కాలము. దేశకాల పరిమాణాలు నాలుగింటిలో మార్పెరుగని నియతవ్యక్తి మానవుడు. కాని, వివిధ కాలాలలో వాని చిత్రాలు తీయవచ్చును. ఉదాహరణకు, నాలుగు, పది, పదిహేను, ఇరవైనాలుగువింటేళ్లప్పుడు వాని చిత్రాలు తీస్తే, అవి వాని కాయమును మూడు పరిమాణాలలో మాత్రమే నిరూపిస్తాయి. ఆ వ్యక్తియొక్క శరీర ప్రకృతిలో సక్రమంగా వాటిల్లిన మార్పులనే పై చిత్రాలలోని వ్యత్యాసాలు సూచిస్తాయి. ఈమార్పులు శారీరకమైనవి, మానసికమైనవి. అందుచేత ఆంతరిక కాలాన్ని రెండువిభాగాలు చేయాలి; అవి శారీరక కాలం, మానసిక కాలం.

మానవుడు తల్లిగర్భంలో పిండంగానుండినప్పటి నుండి జీవితాంతంవరకు పొందెడి శారీరకపు మార్పుల పరంపరయే వాని శారీరక కాలం; వ్యక్తియొక్క వాస్తవపరిమాణాన్ని నిర్ణయించే అవస్థాక్రమంగా దానిని భావించవచ్చును. ఈ అవస్థలలో కొన్ని పరివర్తనీయములు, కొన్ని అపరివర్తనీయములు. గుండె కొట్టుకొనుటం, కండరము (*Muscle*) ల సంకోచం, ప్రక్కకొరింగలోని కణాలచలనం మొదలైనవి పరివర్తనీయములు. చర్మంయొక్క స్థితిస్థాపకశక్తి క్షీణించడం, ఎర్ర రక్తకణాల తగ్గుదల మొదలైనవి అపరివర్తనీయములు. కాని, పరివర్తనీయచలనాలుసైతం వ్యక్తియొక్క జీవితకాలంలో క్రమంగా మార్పు చెందుతాయి. దానితో పాటు శరీర ధాతువుల నిర్మాణం మారుతుండే సంకులమైన ఈ మార్పులే శారీరక కాలం.

బాహ్యప్రపంచప్రేరణ ప్రాబల్యానికి తన అవస్థలలో క్రమంగా కలుగు మార్పులను చైతన్యం లిఖిస్తుంది. మానసికజీవితానికి అత్యంతావశ్యకమైనది కాలమని మానసిక తత్త్వవేత్త హెన్రి బెర్గ్‌సన్ అభిప్రాయం. అవస్థితి (*Duration*) అనగా ఒకక్షణం పోయి మరొకక్షణం రావడం కాదు. భూతకాలం అవిచ్ఛిన్నంగా పురోగమిస్తూ, భవిష్యత్తును బక్కరిస్తూ, పొంగి వ్యాపించడమే అవస్థితిగా బెర్గ్‌సన్

నిర్వచించలేము. భూతకాలంపై భూతకాలం విరామం లేకుండా దొంతరలుగా రాశీకృతమౌతుందిట. యథార్థానికి, భూతకాలాన్ని అదే అప్రయత్నంగా భద్రపరచుకొంటుంది. ఒక వ్యక్తియొక్క భూతకాలం యావత్తు, ప్రతిక్షణం, దానిని అనుగమిస్తూనే ఉంటుంది. ... కొలదిపాటి భూతకాలాన్ని వుస్తుంచుకొని, సామాన్యంగా, మనం ఆలోచిస్తాము; కాని, మన వాంఛలు, బుద్ధి, కర్మలుకూడా మన భూతకాలమంతటిపైని, ఆత్మయొక్క మౌలికస్థితిపైని ఆధారపడి ఉన్నాయి 1

మనమొక చరిత్ర. ఆ చరిత్రయొక్క స్థైర్యమే మన ఆంతరిక జీవితసంపదను తెలియజేస్తుంది. నిన్నటవలె నేడు మనం లేమన్న భావ మేదో మనకు కలుగుతుంది. ఒకప్పుడు రోజులు పరుగెత్తుతాయి. కాని, ఈ మార్పులను నిర్దిష్టంగా కొలవడాని కవకాశం లేదు. మన చైతన్యంయొక్క స్వాభావికగమనాన్ని నిర్వచించలేము.

ఆంతరికకాలాన్ని సౌరకాల ప్రమాణాలలో యుక్తంగా కొలవలేము. శారీరక వయస్సుతో కాలానుక్రమిత వయస్సు సరిపోదు. సౌర సంవత్సరాలలో చెప్పినప్పుడు బాల్యావస్థ స్వల్పంగాను వృద్ధాప్యం దీర్ఘంగాను కనిపిస్తుంది. కాని, శారీరక కాలప్రమాణాలతో కొలిచినప్పుడు బాల్యమే దీర్ఘంగాను, వృద్ధాప్యమే స్వల్పంగాను వ్యక్తమౌతుంది.

భౌతికకాలానికి శారీరకకాలానికి భేదమున్నదని గమనించేము. గడియారాల గమనం వేగీకరించినా మందగించినా, తదనుగుణ్యంగా భూభ్రమణ కాలం మారినట్లయితే, మన అవస్థితిలో మార్పు కలిగించదు. కాని శారీరకంగా ఒకడు ఎదిగినట్లో పెరిగినట్లో కనిపిస్తుంది. ఈవిధంగా సౌరకాలంలో కలిగిన మార్పు అభివ్యక్తమౌతుంది. భౌతికకాలవాహినీప్రవాహంలో ముందుకు సాగిపోతూన్నప్పటికి, శారీరక కాలాని కాధారభూతమైన ఆంతరిక ప్రక్రియల లయతో మనం గమిస్తాము. అందువలనే, నదీతోయముల వెంబడి పోవు ఇసుకరేణువులము కాక, మనం, జలోపరితలంపై వ్యాపించి, ప్రత్యేక గమనముతో నదీప్రవాహముతో ముందుకు సాగు తైలబిందువులము. ఆంతరిక కాలం మనకు సహజమైనది; భౌతికకాలం బాహ్యమైనది.

దోలకం స్పందిస్తూంటే క్షణక్షణం దాని వర్తమానం గతిస్తుంది; అవిరామంగా మన వర్తమానం గతించదు. ఏకకాలమందది మన మనస్సుపై, రక్తంపై, ధాతువులపై లిఖితమై యుంటుంది. మన జీవిత సంఘటనలయొక్క శారీరక మానసిక చిహ్నాలన్నీ మనలో నిద్రపరచుకొంటాము. శారీరకంగాను మానసికంగాను కలిగిన ప్రతి అనుభవంవల్ల మన వ్యక్తిమత్వం పుష్టి చెందుతుంది. ప్రతిభావం, ప్రతికర్మ, ప్రతివ్యాధి, వాటికి ప్రత్యేకమైన ఫలితాలను కలిగిస్తుంది; కాగా, గతంనుంచి మన మెన్నడూ తప్పుకోలేము. ఒకరోగంనుంచికాని, ఒకదుష్కర్మనుంచికాని మనం పూర్తిగా కోలుకోవచ్చు; కాని, వాటి మచ్చను మనం శాశ్వతంగా భరించాలి.

శారీరకకాలంవలె మానసికకాలంకూడా మనయొక్క అంశమే. దానిస్వభావం మనకు తెలియదు. అట్లే ప్రవృత్తిస్వభావంకూడా తెలియదు. కాలం గమిస్తూండిన జ్ఞానంకలగటానికి మాత్రం స్మృతి ఆధారం. మనం మారుతున్నామని గమనిస్తాము; నిన్నటివలె నేడు లేమనికూడా గుర్తిస్తాము. కాని, మన వ్యక్తిత్వం మార్పులేక స్థిరంగానున్నట్లు భావిస్తాము. మానసికకాలానికి దైహిక జీవిత లయతో సంబంధమున్నదని, సంబంధం లేదనితప్ప, అంతకు విపులంగా దాని లక్షణాలు తెలియవు.2

భౌతికకాలవిషయమై తిరిగి ఆలోచిస్తే, దానినొక సరళము, అవిచ్ఛిన్నము, అనంతమునైన నదీప్రవాహంవలె సామాన్యంగా భావిస్తాము. ఆ నది ఎండిపోదు. ఒడ్డున నదీ తటాన నిలబడ్డ మానవుడు ప్రవాహానికి లంబదిశలో మాత్రమే చూడగలడు. ఎవ్వరైనా తన తలను ఇటు అటు త్రిప్పడానికి వీలులేదు. తిన్నగా చూస్తుంటే వర్తమానాన్ని నిరూపించు కాలజలాలు వాని దృష్టిపథంనుండి ముందుకు పారుతాయి; పోయి, భూతకాలాన్ని నిరూపించు జలంతో కలిసిపోతాయి. భవిష్యత్తును నిరూపించు జలాలు క్షణక్షణం అవిచ్ఛిన్నంగా వాని దృక్పథంలోనికి వచ్చి పోతుంటాయి. ఈ ప్రక్రియ అనంతంగా సాగుతునే ఉంటుంది.

ఈ విధంగా మానవదృష్టి సామాన్యంగా వర్తమానానికే నియతమైయుంది. కాని, తలను కొద్దిగా త్రిప్పి, భూతభవిష్యత్తులను కొంతవరకాలోకించు విశేష సామర్థ్యాన్ని కొందరు

1. *Henri Bergson : Creative Evolution.*

2. *Alexis Cassel : Man, The Unknown*

మహానుభావులు పంపిస్తారు. వ్యక్తియొక్క భూత భవిష్యత్తులను అద్భుతంగా చెప్పగల జ్యోతిష్కులున్నారు, మానసికశక్తిసంపన్నులు ఉన్నారు. వారికా శక్తి ఎట్లు సంప్రాప్తమైందో మనం చెప్పకొనలేకపోవచ్చు; కాని, అట్టి శక్తియే లేదనడం బుద్ధిమంతుల లక్షణంగాదు.

పై దానినిబట్టి, మానవబుద్ధియే కాలాన్ని భూత భవిష్యత్ వర్తమానాలను విభాగాలు చేసిందని స్పష్టమౌతుంది. ఒక వ్యక్తివిషయంలో, తను గడిపినది భూతకాలము, గడపనున్నది భవిష్యత్తు. వర్తమానం అతి స్వల్పకాలభాగం. మనం మాట్లాడుకుంటూంటే క్షణంనంబడి క్షణం అనాయాసంగా భూతకాలంలోనికి జారిపోతుంది; వర్తమానం లవమాత్రమైనా ఉండదేమో!

ఈ కాలవిభాగాలు ఏదో ఒక ప్రత్యేక కాలాకాశ చట్టానికే వర్తిస్తాయి. జగత్తులో అసంఖ్యాక లోకాలున్నాయి. ప్రతి నక్షత్రం ఒకలోకమే! నక్షత్రలోకాలలో నివాసయోగ్యులైన జీవులుంటే వారంతా మనవలె ఆకాశాన్ని వీక్షిస్తారు. అప్పుడు ప్రతిలోకం ఒక ప్రత్యేక కాలాకాశ చట్టమౌతుంది. అట్టి సందర్భంలో ఒక లోకానికి వర్తమానమైనది మరొక లోకానికి భూతము, వేరొక లోకానికి భవిష్యత్తు కావచ్చును. మనకు గతమైనది సిరియస్ నక్షత్రవాసులకు వర్తమానము, ఆర్ద్రానక్షత్ర వాసులకు భవిష్యత్తు కావడాని కభ్యంతరంలేదు. అందుచేత, మన లోకాన్ని విడిచి ఆకాశ గహ్వరాలలో ప్రవేశించినప్పుడు భూత భవిష్యత్ వర్తమాన కాల భాగాలు అర్థహీనము లౌతాయి; మరొకవిధంగా వాటిని నిర్వచించవలసిన అవసర మేర్పడుతుంది.

సామాన్యంగా గతంలోనికి చూడలేమని మన అభిప్రాయము. కాని, నిశాసమయాన నక్షత్రాలను చూచినప్పుడు, ఆ నక్షత్ర లోకాల వివిధ భూతకాలభాగాలు మనకు గోచరిస్తున్నాయి. ఇది కాంతియొక్క నియతవేగ ఫలితమే. వస్తువుల వలెనే కాంతికూడా ఒక ప్రదేశంనుండి మరొక ప్రదేశానికి ప్రయాణం చెయ్యడానికై కొంతకాలం తీసికొంటుంది. కాంతి వేగం అత్యధికమువడం చేతను, నిత్య జీవితంలో మనకు సందర్భించు దూరాలు, సాపేక్షంగా, అల్పమైనవి కావడం చేతను, కాంతిగమనానికయ్యే కాలాన్ని గమనించే అవకాశంలేదు. కాని, నక్షత్రాలను చూచినప్పుడు కాంతివేగం ప్రాముఖ్యం వహిస్తుంది. అనంతాకాశ గాంభీర్యాలలో అసంఖ్యాక నక్షత్రగోళాలు విక్షిప్తమైయున్నాయి. వాటి దూరాలను కొలవడానికి మైలుగాని, వెయ్యిమైళ్ళుగాని ప్రమాణంగా పనికిరాదు. మన కతి సమీపంగానున్న నక్షత్ర దూరం కొన్ని లక్షలకోట్ల మైళ్ళుండుటచేత, ఆ విపరీతదూరాన్ని అవగాహన చేసికోడానికై ఒక జ్యోతిషప్రమాణాన్ని కల్పించవలసి వచ్చింది. దాని పేరు 'కాంతి సంవత్సరం.' సెకనుకి 18600 మైళ్ళ చొప్పున ఒక సంవత్సరంలో కాంతి ప్రయాణం చేసే దూరమది. దాని విలువ సుమారు 6 లక్షలకోట్లమైళ్ళు. ఈ లెక్కని మన సమీపతమ తారదూరం 4¼ కాంతి సంవత్సరాలు. కాంతిమంతమైన సిరియస్ నక్షత్రదూరం 8½ కాంతి సంవత్సరాలు. మృగవ్యాధకూటంలోని ఎర్రటి ఆర్ద్రా నక్షత్రదూరం 200 కాంతి సంవత్సరాలు. ఏండ్రోమెడలో నున్న పెద్ద నెబ్యులా 800,000 కాంతి సంవత్సరాల దూరంలో నుంది. మౌంట్ విల్సన్ వేధశాలలో గల 100 అంగుళాల దూరదర్శినితో ఫోటోగ్రాఫ్ చేయగల దూరతమ నెబ్యులాలనుండి బయలుదేరిన కాంతి మనలను చేరుకోడానికి 14 కోట్ల సంవత్సరాలు తీసికొంటుంది; ఇంతకాలం ఆకాశ మార్గాన నిర్విరామంగా అది ప్రయాణం చేస్తునే ఉంటుంది.

నియతవేగంతో కాంతి ప్రయాణం చేయుట వల్ల కలిగే ఫలితమేమిటి? అంటే, దానిమూలంగా మనం గతంలోనికి చూచే అవకాశం కలుగుతూంది. అయితే మనం చూచేది మన గతం కాదు; వివిధనక్షత్రాల భూతకాలాన్ని చూస్తున్నాము. 1953 జూలై 1 వ తేదీ రాత్రి సిరియస్‌ను చూచేమంటే, దాని వర్తమానస్వరూపం మనకు కనిపించదు; 1945 జనవరిలో అదేవిధంగా నుండేదో ఆ స్వరూపాన్ని మాత్రమే మనం చూడగలుగుతాము ఆనాడు సిరియస్ నుండి బయలుదేరిన కాంతి సంవత్సరానికి 6 లక్షల కోట్లమైళ్ళ చొప్పున నిర్విరామంగా గమిస్తూ, 8½ సంవత్సరాలయ్యేక మనకంటికి సమకూరుంది. అందుచేత, సిరియస యొక్క ప్రస్తుత స్వరూపాన్ని చూడాలంటే 8½ సంవత్సరాలు వేచియుండాలి. కాగా, సిరియస్‌ను ఏ క్షణమందు చూచినప్పటికీ, ఆ క్షణానికి 8½ ఏండ్ల పూర్వపు సిరియస్ రూపాన్నే చూస్తున్నాము. సిరియస్ వర్తమానాన్ని చూచే అవకాశమే లేదు.

ప్రతి నక్షత్ర విషయ మింతే. ఇప్పుడు మఖ ఎట్లుంది? ధ్రువనక్షత్ర మెట్లుంది? అన్న ప్రశ్నలకు సమాధానం చెప్పలేము. మఖ నెప్పుడు చూచినా అప్పటికి 70 ఏండ్ల క్రిందట ఎట్లుండో అట్లు మాత్రమే మనం చూడగలుగుతాము. ధ్రువనక్షత్రాన్ని చూచినప్పుడల్లా 1085 ఏండ్ల క్రిందటి దాని స్వరూపమే మనకు గోచరిస్తుంది. 50 ఏండ్ల క్రిందట మఖ భస్మమై యుంటే, మరొక 20 ఏండ్ల వరకు దాని స్థానంలో అది దీపిస్తునే ఉంటుంది. ఒకనాడు హఠాత్తుగా మఖానక్షత్రం అదృశ్యమైతే, నాటికి 70 ఏండ్ల క్రితమే మఖకు ప్రమాదం సంభవించి ఛిన్నమైపోయిందని భావించాలి. ఇప్పుడు మన కంటికి కనబడుతున్న ఏండ్రోమెడ కూటంలోని నెబ్యులా కాంతి నెబ్యులానుండి బయలుదేరినపుడు భూమిలో మానవుడు జన్మించలేదేమో!

కాంతి నియమిత వేగంవల్ల ఇంకొక విశేషానుభవం కూడా మనకు కలుగుతూంది. అనంత భూతకాలాన్ని ఖండఖండాలుగా విభజించి, వివిధ ఖండాల నొకేసారి చూడగలుగుచున్నాము. అంటే, ఆకాశాన్ని వీక్షించినప్పుడు 8½ ఏండ్ల క్రిందనున్నట్టి సిరియసును, 70 ఏండ్ల క్రిందటి మఖను, 360 ఏండ్ల క్రిందటి జేష్ఠను, 1085 ఏండ్ల క్రిందనున్నట్టి ధ్రువనక్షత్రాన్ని ఒకే సమయమందు చూస్తున్నాము. మన దృష్టిసామర్థ్య మధికమైన కొద్దీ గతాన్ని ఎక్కువగా చూడగలము.

మనం గడచిన కాలం లయం కాలేదు; అది కాలగర్భంలో కలిసిపోలేదు. అనంతాకాశంలో ఏదో ఒక ప్రదేశంలో వర్తమాన కాలభాగంగా అది వ్యక్తమౌతూనే ఉంది. పరలోకవాసులు, మనవలె, సునిశిత యంత్రాలు నిర్మించి, వాటిని భూమిపై ప్రసరింపచేసి పరిశోధనలు గావిస్తే భూమినుండి ప్రసరింపబడిన కాంతిని విశ్లేషించి భూవిశేషాలను వారు తెలిసికోవచ్చును. మహాసంగ్రామాలను, వైభవోపేతంగా జరుగు మహోత్సవాలను వారు స్పష్టంగా చూడవచ్చును. అట్లే మనముకూడ భూమినుండి బయలుదేరిన కాంతి శూన్యాకాశయానం గావిస్తూ, ఒక్కొక్క నక్షత్రలోకాన్ని దాటి, యంత్రాలతో పరిశీలిస్తున్న విజ్ఞులకు భూవిశేషాలను నివేదిస్తుంది. 17 వ శతాబ్దంలో జరిగిన భూసంఘటనను ధ్రువనక్షత్రవాసు లిప్పుడే చూస్తారు. వారికది వర్తమానంలో సంభవిస్తుంది. కాని, ఆ సంఘటనను ధ్రువనక్షత్రవాసులు సుమారు 740 ఏండ్లు పోయినతరువాత చూస్తారు. వారికది భవిష్యత్తులో దాగియుంది. ఇట్లే, ఏ భూసంఘటన కాని విద్యుద్వయస్కాంతతరంగ రూపంలో ఆకాశయానం చేస్తూ కాలాకాశ అవిరతికంలో శాశ్వతంగా నుంటుంది. అందుచేత, వివిధ కాలాకాశ నక్షత్రాలకు ఆ సంఘటన భూతభవిష్యత్ వర్తమానాలలో వాటిల్లినప్పటికి, అనావృతాకాశంలోను అనంతకాలంలోను అది నిత్యయౌవనంగానే ఉంటుంది.

కాలప్రవాహదిశను మార్చలేము. గతం లోనికి చూచు టెంతకష్టమో గతంలోనికి ప్రయాణం చేయుటకూడ అంత కష్టమని సామాన్యుల అభిప్రాయము. కాని, నక్షత్రాలను చూచినప్పుడెల్లా వాటిగతాన్నే చూస్తున్నామని, వాట వర్తమానాన్ని తెలిసికొనడమే దుర్లభమని గమనించేము. అందుచేత గతంలోనికి చూడలేమనుట సత్యంకాదని విశదమైంది.

ఒకవ్యక్తియొక్క వయస్సును భౌతిక సంవత్సరాలలో వాకొంటాము. దినదినం మానవుల వయః పరిమాణం పెరుగుతూంది. గడచిన ప్రతిదినం అనివార్యంగా గతంలోనికి పోయిందని, ఒకనాడు జీవించిన సాయంకాలాన్ని తిరిగి జీవింపలేమని భావిస్తాము. కాని, అత్యధిక వేగంతో ప్రయాణించుటకవకాశం కలిగించిన జెట్ విమానాలమూలంగా మానవులు గతంలోనికి ప్రయాణంచేయు సామర్థ్యాన్ని సంపాదించినట్లుంది. ఒక ఉదాహరణ పూర్వకంగా విషయాన్ని బోధపరచుకోవచ్చు.

విశాఖపట్నానికి లండను పడమరగా నుంది. ఆ రెండుపట్టణాల రేఖాంశభేదంవల్ల వాటి ప్రమాణ కాలాలకు 5½ గంటల వ్యత్యాసముంది. విశాఖపట్నం గడియారాల చెప్పుడు 5½ గంటలు వెనుకనుంటాయి లండను గడియారాలు. విశాఖపట్నంలో రాత్రి 7 గంటలైనప్పుడు లండనులో ఆ దినాన్నే మధ్యాహ్నం 1½ గంట లౌతుంది.

గత మహాసంగ్రామంలో విమానాల వేగాలను అధికం చెయ్యడానికి పలువిధాలు ప్రయత్నించేరు. గంటకు సుమారు 700 మైళ్ళ వేగంతో శబ్దం ప్రయాణిస్తుంది. శబ్దవేగాన్ని మించిన వేగంలో గమించు జెట్ విమానాలు వాడుకలోనికి వచ్చేయి. కొన్ని విమానాలు గంటకు 1000 మైళ్ళ వేగాన్ని చేరుకొన్నట్లు అమెరికా విమానశాఖవారు ప్రకటించేరు. 2000 మైళ్ళ వేగాన్ని చేరుకోడానికి

కూడా తీవ్రప్రయత్నాలు జరుగుతున్నాయి. శబ్ద వేగాన్ని దాటినతరువాత ఎంతటి వేగాన్నైనా చేరుకోవడం కష్టంగాదు. అందుచేత, కొద్దికాలంలో 2000 మైళ్ళ వేగంతో గమించు విమానాలు తయారయే అవకాశం లేకపోలేదు. సంపీడిత వాయువుగల గదులలో కూర్చుని వైమానికులు ప్రయాణికులు ఆకాశార్ణవంలో సుఖంగా ప్రయాణం చేయగలరు.

విశాఖపట్నంనుండి లండన్‌కు ప్రయాణమయేడు సత్యం. ఈ జూన్ తే 8 దీ సాయకాలం జెట్ విమానంలో ప్రయాణానికేర్పాట్లుచేసేరు. ఆ సాయంకాలం టౌన్‌హాలులో పెద్ద వీడ్కోలు సభ జరిగింది. పలువురు సత్యాన్ని అభినందించేరు. సభానంతరం ఇంట్లో భోజనంచేసి రాత్రి 7 గంటల విమానంలో ఎక్కేడు. బంధుమిత్రులు విమానాశ్రయం వచ్చి చేరి, విమానపు ఎర్రకాంతి మాయమయేవరకు వేచియున్నారు. ఆ విమానం 2000 మైళ్ళ వేగంతో సాగిపోయింది.

మెత్తటి కుర్చీలో సుఖాసీనుడైన సత్యం ఆకాశాన్ని చూస్తున్నాడు. కొంతసేపటికి పడమటను సూర్యోదయ మౌతున్నట్లు కనిపించింది. నిజమే; సూర్యబింబం క్షితిజరేఖపై లేచి, పడమటనుండి తూర్పుకి గమిస్తోంది. ఆ సంఘటనను అవగాహన చేసికోడానికి కొంతకాలంపట్టింది. విశాఖపట్నంలో సూర్యాస్తమయ మయేక బయలుదేరి, మహావేగంతో పడమరముఖంగా గమిస్తూన్న తన విమానం సూర్యునికంటె ముందుపోవడంచేత సూర్యోదయం పడమటనే జరిగింది. మూడుగంటల ప్రయాణానంతరం లండన్ చేరుకొన్నాడు. అప్పటి బిగ్ బెన్ గడియారం ప్రకారం సాయంకాలం 4½ గంటలయింది. ముచ్చటైన లండన్ పార్కులలో విహరించి, మనోహరమైన బహువర్ణయుత సూర్యాస్తమయదృశ్యాన్ని మరొకసారి సత్యం వీక్షించేడు. చీకటిపడేసరికి ఆకలి వేసింది; ప్రయాణపు బడలిక దానికితోడయింది. అందుచేత రాత్రి భోజనంచేసి, హోటేలులో హాయిగా నిద్రించేడు.

ఒకే సాయంకాలాన్ని రెండు ప్రదేశాలలో రెండుసార్లు సత్యంగడిపేడు; రెండుసార్లు రాత్రి భోజనం చేసేడు. సూర్యుని అధిగమించి కాలప్రవాహానికి యెదురీదేడు. ఒక్కరోజులో 24 గంటలకంటె ఎక్కువ కాలం జీవించేడు. ఆనాడు ప్రతిరోజు కంటె ఎక్కువ ఆహారాన్ని భుజించేడు; ఎక్కువ అరిగించుకొన్నాడు. ఈవిధంగా విశాఖపట్టణంనుండి లండన్‌కు ప్రయాణంచేసిన ప్రతిదినాన్ని సత్యం ఎక్కువ గంటలు జీవిస్తాడు; ఎక్కువ భుజిస్తాడు. ఈ గంటలన్నీ కలిసి అతని జీవితకాలాన్ని ఎక్కువ చేస్తాయి. అంటే గతంలోనికి ప్రయాణం చేయడంవల్ల సత్యం దీర్ఘకాలం ఆరోగ్యవంతుడై జీవిస్తాడు.

వెయ్యిమైళ్ళ వేగంతో ప్రయాణంచేయు విమానాన్ని రమేశ్ నడుపుతున్నాడు. భూమధ్యరేఖ వెంబడే సుమారుగా తన విమానాన్ని పశ్చిమముఖంగా రమేశ్ తీసికొనిపోతాడు. సూర్యోదయ సమయాన విమానయానం ప్రారంభించేడు. ఏ ప్రదేశంలోనున్నా అక్కడ సూర్యోదయ మౌతూనే ఉంటుంది. ఉదయభానునితోనే రమేశ్ గమిస్తాడు. అంటే రమేశ్‌ని సూర్యసారథి అనూరుడుగా భావింపవచ్చును. రమేశ్‌కి మధ్యాహ్నం, సాయంకాలం, రాత్రి మొదలగు కాలవిభాగాలు తెలియవు; ఏమంటే ఎల్లప్పుడు బాలభాస్కరుని సన్నిధినే ఉంటాడు. ఆ విధంగా నిరంతర ప్రదక్షిణం గడుపు రమేశ్‌ని 'నీ వయస్సెంత?' అని ప్రశ్నిస్తే తెల్ల మొగం వేస్తాడు. తన భౌతిక వయస్సును నిర్ణయించుకొనే అవకాశం రమేశ్‌కి లేదు. తనెన్నిరోజులు జీవించేడో చెప్పలేడు; నిశాకాంతదర్శనమే చేయలేదు రమేశ్. నక్షత్రాలను చూడలేదు. పాలిపోయిన చంద్రబింబం [illegible] గోచరించదు. అయితే, భూమిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తూన్న రమేశ్ ఏదో ఒక మహాపట్టణాన్ని గుర్తుంచుకొని, దాని నెన్నిమార్లు దాటిస్తే అన్నిదినాలు గడిచినట్లు భావించుకోవచ్చు.

భూభ్రమణ వేగాన్ని మించిన వేగంతో ప్రయాణం చేయగల సామర్థ్యం మానవుడు సంపాదించినప్పుడు ఉత్పన్నమయే అనేక క్లిష్టసమస్యలలో ఇవి కొన్ని.

---

# బౌద్ధశిథిలములు-సాలిహుండము



శ్రీ మండ నరసింహం

శ్రీకాకుళమునకు పదిమైళ్ళదూరమున సాలిహుండ మను గ్రామము కలదు. ఈ గ్రామమునకు చేర్పుననే రెండుశిఖరములు గల యొక చిన్న పర్వతమున్నది. పర్వతమునకు కట్టి, వంశధార యనునది పారుచున్నది. తూర్పు సముద్ర మిచ్చటికి నాల్గుమైళ్ళ దూరమందున్నది. వంశధార నది ఈ సముద్రములో కళింగపట్టణము చేరువనే కలియుచున్నది. సాలిహుండ మను గ్రామమునకు నాల్గుమైళ్ళ దూరముననే సముద్రతీరమున పురాతన కాలమునుండియు ప్రసిద్ధిగన్న శ్రీ కూర్మనాథస్వామి వారి దివ్యాలయమును శ్రీ కూర్మ మను గ్రామమును కలవు.

ఈ దేవాలయ మతిప్రాచీనమైనది. దేవాలయ ప్రాకార కుడ్యములపై నైదారు శతాబ్దములనాటి శిలాశాసనము లుండుటచేత నియ్యది యంతకుపూర్వమే ప్రతిష్ఠింపబడి యుండవలయును. ప్రాకారమున దరిదాపు నూరు శిలాస్తంభములు విచిత్ర శిల్పములతో నొకదాని మించిన సౌందర్యమును మరియొకటి కలిగి విరాజిల్లుచున్నవి. ప్రతిస్తంభము నలుపలకలాకారముగలిగి పురాతన శిలాశాసనములతో నిండియున్నది. గోడలపైగూడ వీలగు చోటులందెల్ల శిలాశాసనములు నాగరి, తెలుగు—కన్నడము, తమిళము, ఉత్కళము మొదలగు భాషల లిఖింపబడి యున్నవి. ఈశాసనములు రెండుమూడువందలకు మించియున్నవి. భారతదేశమందలి చిన్నచిన్న రాజుల శాసనములనుండి సామాన్య ప్రజల దానాదికముల దెల్పు శాసనములు గలవు. అద్వైత, ద్వైత, విశిష్టాద్వైత మత ప్రవిష్టుల శాసనములేగాక బౌద్ధ, జైన, శాక్తేయ మతస్థుల శాసనములుగూడ కలవు.

దేవాలయమందలి సింహద్వారగోపురము గంభీరముగ కూర్చబడి రాష్ట్రకూటపద్ధతిని బోలియుండును. గర్భాలయముపై నిరక్షరముగూడ ప్రాకారమందు శిఖరభాగము వైష్ణవచిహ్నమగు చక్రముచే నొప్పుచున్నది. తొలుదొల్త నియ్యది యొక బౌద్ధస్థానమయి, తరువాత జైనాలయమై, ఆ వెనుకను శైవాలయమై నేటికి విష్ణ్వాలయముగ వివిధ మత పరిణామ దశల బొంది యుండవచ్చును.

ఇండియా ప్రభుత్వమువారు 1918 వ సంవత్సరమున నీ యాలయమందలి శిలాశాసనముల శోధించి మూలమును నిర్ణయించి ప్రచురింప ఢిల్లీనుండి రా॥ బ॥ హెచ్. కృష్ణశాస్త్రిగారిని, ప్రభుత్వ పురాతత్వ విశారదుని, పంపిరి. వారీ శ్రీ కూర్మగ్రామమున తమ పరివారముతో రెండుమూడు వారములుండి శిలాశాసనముల శుభ్రము చేయించి యథార్థపాఠమును నిర్ణయించి, ప్రతిబింబముల దీయించి ప్రచురణార్థము సర్వమును సిద్ధము చేయించిరి. (ఈ వ్యాసకర్త గూడ శాసన పాఠముల నిర్ణయించుటలో వారికి దోడ్పడెను)

పురాతన శాసనలిపులనుపరీక్షించి చదువునప్పుడు కొన్ని శాసనములందు ఆకాలపు రాజులు తమ దానాదికముల తెలియజేయు సందర్భమున, బౌద్ధదేవునకు కొన్ని సువర్ణములును రత్నాదులును, కూర్మేశ్వరునకు దీప ధూప నైవేద్యాదులకై కొన్ని సువర్ణములును సమర్పించినట్లు తెలియవచ్చినది. ఇందుచేత బుద్ధదేవుని ఆలయ మీ సమీపమందుండినట్లు నిశ్చయింపబడినది. మరికొన్ని శాసనములలో కొండపైనున్న బుద్ధదేవునకనియు ఇంక కొన్నిటియందు బౌద్ధవిహారపు పునర్నిర్మాణమునకనియు ధన మొసగబడినట్లు చెప్పబడినది. దీనివలన శ్రీ కూర్మమునకు సమీపమందలి సాలిహుండము కొండమీద బౌద్ధస్థూపములు విహారములు కలవని రూఢియయ్యెను.

తరువాత నీకొండపై బరీక్షింప నొక శిఖరమున నూతనముగ నిర్మింపబడిన యొక హిందూ వైష్ణవ దేవాలయమును, మరియొక శిఖరమున పురాతనపు ఇటికలు శిథిలములు గానవచ్చినవి. కొంచెము లోతుగ త్రవ్వి చూడగ పురాతనపు గోడలు మొదలగునవి గానవచ్చెను. ఇప్పుడుచ్చోటున బౌద్ధాలయములు— స్తూపములు విహారములు — గలవని నిర్దేశింపబడినది. ప్రభుత్వానికీ విషయమును ఢిల్లీప్రభుత్వమునకు

వెలుకపరచిన పై 1921వ సంవత్సరమున కొండను త్రవ్విశిథిలముల బైటకుదీసి పరీక్షించుటకొరకు ఒక యున్నతోద్యోగి నియమింపబడెను. వారి యాజమాన్యమున రెండు చిన్నస్తూపములు నొక విహారము తెరువబడెను. అందుండు రాతిపెట్టెల బౌద్ధ స్మారకచిహ్నములును, రత్నములు, బంగారు నగలు మొదలగు వస్తువులు సేకరింపబడెను. ఇయ్యవి లండను మ్యూజియమున భద్రపరుపబడినట్లు వదంతి. కారణాంతరములచే త్రవ్వుపని కొంతకాలమైనపిదప నిలచిపోయెను. తిరిగి 1935-36 సంవత్సరముల నీపని ప్రారంభమైనది. ప్రధానస్తూపము గుర్తింపబడినది. అందుగూడ రత్నములు బంగారునగలు రాతిపెట్టెలు బయటపడినవి. అంతటితో ప్రపంచ ద్వితీయ సంగ్రామ మారంభము కాగా శేషించిన త్రవ్వుపని నిలుపబడెను. ఇంకను శాస్త్రజ్ఞులు త్రవ్వి చూచిన మరేయే విశేషములు బయలుపడునో! ఆపిమ్మట నీకొండ ప్రభుత్వరక్షణమందుంపబడినది.

సాలిహుండమను గ్రామము రెండువేల జనసంఖ్య గల యొక చిన్నగ్రామము. గ్రామమునకు హత్తియే ఈ బౌద్ధశిథిలములు గల కొండ గలదు. పురాతత్వశాస్త్రజ్ఞు లీకొండపై కట్టడములు ఆంధ్రరాజులు పరిపాలించిన కాలమందు నిర్మింపబడినవని నిర్ధారణము చేసియున్నారు. వారు క్రీస్తుశకారంభకాలమున నేలుచుండినట్లు దేశచరిత్రము చెప్పుచున్నది. ఆంధ్రరాజవంశమువారును ఆతరువాత ఆంధ్రభృత్యవంశపు రాజులును దేశమును పాలించినట్లు పురాణములు చెప్పుచున్నవి. ఆ పురాణగాథలు, ఆకాలమునాటి ప్రాకృత శిలాశాసనములవలనను ఆకాలమునాటి కట్టడముల శిల్పవైచిత్ర్య నిర్మాణమువలనను చారిత్రాంశములుగ రూఢియైనవి.

ఇక్ష్వాకువంశరాజులు క్రీస్తుశకారంభమునకు పూర్వమునుండి ఆంధ్రరాజ్య మేలుచుండిరి. వారందరును బౌద్ధమతావలంబకులే! అమరావతి, జగయపేట, నాగార్జునకొండ మొదలగు చోటులవారిచే కట్టబడిన బౌద్ధస్తూపములు అందుండు ప్రాకృతశాసనములు ఆకాలమునాటి వారిప్రాభవమును వెల్లడి చేయుచున్నవి. ఈ రాజులు తమ శౌర్యసాహసములచే మగధరాజ్యమునుగూడ స్వాధీనపరచుకొని చక్రవర్తులైరి. వీరిలో కొందరు వైదికమతావలంబకులై యజ్ఞయాగాదుల చేయుచుండిరి. అశ్వమేధయాగములు జేసిన చక్రవర్తులుగూడ గలరు.

శాలివాహను డీయాంధ్రరాజవంశమున కడపటివారిలో మిక్కిలి ప్రఖ్యాతుడు. వీనినిగూర్చిన గాథలనేకములు గలవు. ఈతడు శకసంస్థాపకుడు. ఆంధ్రదేశమున నేటికినిగూడ కాలగణనమునకు శాలివాహనశకమే వాడుచున్నారు. ఆంగ్లేయుల పరిపాలనమున క్రీస్తుశకము ప్రభుత్వమువారిచే నెలకొల్పబడి ప్రచారమునకు వచ్చినది. అంతకుపూర్వము హిందువులు శాలివాహనశకమును ఆంధ్రరాజ్యమున వాడుచునే యుండిరి.

ఈ శాలివాహనునకును సాలిహుండమను గ్రామమునకును ఏదియోని సంబంధముండి యుండవచ్చును. శాలివాహనునకు ప్రాకృతరూపము సాలెవాహుడగుచున్నది.

'హుండాం', 'హుండి' అనుపదములు ఆంధ్రదేశమున ఒక చిన్నప్రదేశమునకు అనగా ఒక పదిపదేను గ్రామములుండు ప్రాంతమునకు చెల్లుచున్నది. దీనినిబట్టి ఈ యూరు శాలివాహనుని యేలుబడిలోని యొక చిన్నప్రదేశమగుచున్నది. అయితే సముద్రతీరమందలి ఈ ప్రదేశమంతయు నాటి కళింగరాజ్యాంతర్భాగమగుచున్నది. అట్టి కళింగరాజ్యమున ఆంధ్రరాజగు శాలివాహనునకీ చిన్న ముఖ్యమైనప్రదేశ మెటుల లభ్యమైనది?

శాలివాహనునకు కొన్ని సంవత్సరములపూర్వము కళింగరాజ్యమున ఖారవేలు డనురాజేలుచుండెను. ఈతడు ఘోరవేలుడనియు [illegible]నియు [illegible] మతస్థుడనియు జైనకులస్థుడనియు పురాణముల వర్ణింపబడియుండెను. ఇతడు గొప్ప మతావేశముగలవాడు, పరమధార్మికుడు, భిక్షురాజు. ఖండగిరి, ఉదయగిరియందు పర్వతగుహలను భిక్షులకు నిర్మించినవాడీతడే. ఆకాలమున బౌద్ధజైనమతములు పరస్పర సమానభావముతో నుండెడివి. అందుచేతనే కాబోలు, శాలివాహనుడు కళింగరాజ్యమున వంశధారానదీతీరమున నీకొండయు పరిసరగ్రామములు కొన్నింటిని సంపాదించి బౌద్ధమతవ్యాప్తికొరకు సంఘారామముల, విహారముల, స్తూపముల నిర్మించి యుండెనో? ఆంధ్రసామ్రాజ్యమునకు కళింగరాజ్యమునకును ఆ కాలమున పరస్పర స్నేహభావముండెనని యూహించుట కవకాశమున్నది. మౌర్యరాజ్యాధిపతి అశోకుడు మగధనుండి దండువచ్చి కళింగమును జయించిన మరి నూరు సంవత్సరములు పోయినతర్వాత, కళింగాధిపతి ఖారవేలుడు పాటలీ నగరమును జయించి అప్పటి ఆంధ్రసామ్రాజ్యప్రతిష్ఠకు తోడ్పడి యుండవచ్చును. అందువలన ఆంధ్ర కళింగరాజ్యములు స్నేహభావ

మును గట్టి దానిచుట్టును ప్రదక్షిణము చేయుటకు వలయాకార మార్గ మేర్పాటు చేయబడెను. లోన ప్రవేశించుటకు విశాలమగు మార్గ మేర్పాట చేయబడెను. స్తూపమునకు కంఠహారముగ రాతిగోలుసు అమర్చబడియున్నది. చివరిభాగమున శిలా నిర్మిత ఛత్రముగలదు. దీని నే శిరస్తూపమని చెప్పుదురు.

దీనికి కొంచెము వెనుకభాగమున ప్రధాన స్తూపమున కిరుపార్శ్వముల మరి రెండు స్తూపములు గలవు. ఈ స్తూపములచుట్టు విహారములు గలవు. విహారములలో జొచ్చి స్తూపములకు ప్రదక్షిణము సేయుటకు మార్గము కలదు. ఈ రెండును—స్తూపవిహారములు—బుద్ధుని వక్షస్థలముగ భావింపబడుచున్నది. ఈ స్తూపములపై గూడ ఛత్రము లమర్చబడియున్నవి. రాతిపెట్టెలందు బౌద్ధస్మారక చిహ్నములు గూడ నుంచబడినవి.

ఇక పాదతలమున మరి రెండు స్తూపములు నిర్మింపబడియున్నవి. ఈ రెండును కొండయొక్క రెండవ శిఖరమున గలవు. అందుగూడ వక్షోభాగమందలి విహారముల నడుమ స్తూపములు గూర్చబడినవి కాని యివి చిన్నవి. వీనియందుగూడ స్మారక చిహ్నములుగల రాతిపెట్టె లుంచబడినవి శిరోభాగమున ఛత్రములుగూడ గలవు.

రాతిపెట్టెలు ఒక్కొక్క పెద్ద తిరుగలిని బోలియుండును. పెట్టెలో బుద్ధుని చితిభస్మముగాని మరియే చిహ్నమైనగాని యుండును. అందు నవరత్నములుండును. బంగారు పూవులు మాలలు అలంకరణములు ప్రతి రాతిపెట్టెయం దుంచబడును. ఈ పెట్టెలు చంద్రకాంతమణులచే చేయబడిన—చలువరాతి పలకలు—పలకలచే కట్టి స్తూపాకారముగ నిర్మింపబడును. బౌద్ధభిక్షులు సంఘారామముల నుందురు. ప్రార్థనకాలమున విహారములందలి స్తూపములచుట్టు దిరుగుచు పిటకముల పారాయణ సేయుచుందురు. లేదా విహారములందు యోగాసనములనుండి ధ్యానము సేయుచుందురు.

ఒకసారి యిప్పుడా శిథిలముల జూచిన, మన మిప్పు డిరువదియవ శతాబ్దమున నుండి తిమన్న వాటను మరచిపోయి యేనాడో బౌద్ధమత ముచ్చదశయందున్న కాలమున అనగా క్రీస్తుశకమునకు పూర్వము రెండు శతాబ్దముల క్రిందట నుంటిమని మనసున భావించుకట్టును. ఆ శిథిలములే ఇట్టి మనఃపరివర్తనమును కలిగించుచుండె ఆ స్తూపములు, ఆ విహారములు, ఆ సంఘారామములు ఉచ్చదశ యందుండునపుడు ఎట్టి మనఃపరివర్తనము కలిగింప గలుగుచుండెనో మనమూహింపశక్యము కాదు. నాటి వైభవమంతయు మాసిపోయినది. నాటి రత్నములు బంగారు పూవులు, నగలు మొదలగు శిలాశిల్పములు లండన్ మ్యూజియమున ప్రదర్శింపబడుచున్నవి. మరికొన్ని శిలాశిల్పములు చన్నపురి మ్యూజియమందు భద్రపరచిపడియున్నవి. నేడీ కొండ శిఖరములపై పూర్వకాలమందలి స్తూపములు మొదలగు వాని పునాదులును పెద్ద పెద్ద శిలావిగ్రహములును మాత్రమే మిగిలియున్నవి. ఆ కాలమున నిర్మితమైన ఇటుకలు రాతిపలకలు నేటివరకు శేషించియున్నవి. ప్రస్తుతము ఒక ప్రభుత్వోద్యోగి ఈ కొండలపై శిథిలముల దొంగలాపహరించకుండ కాపలా చేయుచున్నాడు. కొండ శిఖరాగ్రమునకు పోవుట కనుకూలముగ బాటయొకటి నిర్మింపబడినది. మోటారులుగూడ నచ్చటకు బోగలవు. పర్వతాగ్రమునుండి చూచిన ప్రక్కనుండి ప్రవహించు వంశధారా నదియు సాగరమును దిగువభాగమందలి పల్లెగ్రామములును అతిరమ్యముగ గానవచ్చును. బౌద్ధయుగమునాటి నాగరకతయు వైభవమును మతాభిమానమును గనుగొన నుద్దేశముగల ప్రతి హైందవుడును తన జీవితములో నొకసారియైన నీ పర్వతమును నచ్చటి శిథిలములను చూచి తీరవలెను.



# గ్రంథవిమర్శనము

## ప్రకృతీ పాంచజన్యము

[ఖండకావ్య సంపుటి]

కవికొండల వేంకటరావు ప్రతులకు: రచయిత రాజమహేంద్రవరము వెల: 1-12-0.

ఈ గ్రంథ పీఠికలో రచయిత తాము వ్రాసిన ప్రకృతి కావ్యాలన్నీ కొత్తగా ఈ పేరుతో ప్రకటిస్తున్నామని, అయితే ప్రకృతి కవితకు అంతగా సంబంధించని 'రాగోపంతము' వంటి ఖండకావ్యాలు కొన్ని ఈ సంపుటిలో చేరాయనీ వ్రాశారు. అంతేగాక పూర్వం ప్రకటించిన 'ప్రకృతి చందనం'లో కొన్ని ఖండకావ్యా లిందులో చేర లేదనికూడా వ్రాశారు. రచయిత తమ ప్రకృతి కవితా రచనలన్నీ ప్రత్యేక సంపుటాలుగా ప్రకటించడం ముదావహం. ఇకముందు సంపుటాలలోనైనా వీరు ప్రకృతికి సంబంధించని కృతికలు చేర్చకుండా కేవలం ప్రకృతి కావ్యాలే ప్రకటించగలరని ఆశిస్తున్నాను.

'ప్రకృతి' శబ్దం హ్రస్వాంతంకాని దీర్ఘాంతం గాదు. ఇట్లాగ ఈ కావ్యసంపుటిలో కొన్ని కొన్ని శబ్దదోషాలు దొర్లాయి. అవన్నీ వీరు ముందు సంపుటాలలో సవరించుకోగలరని ఆశిస్తున్నాను.

ఆధునాంధ్ర పాశ్చాత్య కవితామార్గాలలో ప్రకృతికవిత ఒక ప్రత్యేక కవితామార్గంగా స్థిర పడింది. మన ప్రాచీనవాఙ్మయంలో ఋతుసంహారం లాటి ప్రత్యేక ప్రకృతి కావ్యా లున్నాయిగాని నేటి కాలపు కవితలోని ప్రకృతికవిత ఎక్కువగా పాశ్చాత్య కవితారీతుల ననుసరించి బయలుదేరినది అని చెప్పాలి.

నేటి ఆంధ్రకవులలో సకృత్తుగా ప్రకృతి వర్ణన పరమైన ఖండకావ్యాలు వ్రాసినవా రున్నారుగాని, ప్రత్యేకంగా ప్రకృతి కవిగా పేర్కొనవగిన ఆధునిక కవి శ్రీ కవికొండల వెంకటరావుగా రొక్కరే. ముఖ్యంమీద వీరి కవిత్వంలో ప్రకృతి కున్నంత ప్రాధాన్యము, ఏ వస్తువు మిగిలినవాటికి రాలేదు. మిగిలిన రచనలలోకూడా ప్రకృతి కవితాచ్ఛాయలు బాగా ఎక్కువగా పడుతూంటాయి. తెలుగుదేశంలో పల్లెపట్టులలో కనిపించే ప్రకృతి సౌందర్యం చక్కని జానపద సారళ్యంతోను, బహుముఖమైన విషయ వైవిధ్యంతోను, వీరి కవితలో ప్రతిఫలిస్తూ ఉంటుంది.

దూరపు నల్లమాపు, వానపాటు, ఏటిపునీడలు, తురాయి పువ్వు, పున్నాగము మొదలైన వివిధ శీర్షికలనుబట్టి వీరి ప్రకృతి వైవిధ్యం గ్రహించ వచ్చును.

శ్రీ వేంకటరావుగారు ఈ సంపుటిలో చేర్చిన ఖండకావ్యాలలో అత్యుత్తమ రచన మొదలు, అతి సామాన్య రచనవరకు గల ఖండకృతులన్నీ కలగా పులగంగా కనిపిస్తూంటాయి. ఈ సంపుటిలో మాత్రం మొత్తంమీద అత్యుత్తమరచనలే ఎక్కువ.

ఈ రచనలలో కొన్నిచోట్ల ప్రకృతి ఎక్కువగా కవిభావనా రంజితంగా కనిపిస్తుంది. అయితే చాలా చోట ఆవిష్కంగా కాకుండా స్వచ్ఛంగా అద్దంలో ప్రతిఫలించినట్లు మెరుస్తూంటుంది. 'అసాయం కాలము' అనే ఖండకృతి దీనికి తార్కాణంగా స్వీక రించవచ్చును.

'అరుణగభస్తితా బహిమటన్
ప్రభిలీనుచు కెట్లవెన్కదా
రు రమణ దోపజేసెడు విలో
లత నప్పుడె శీతవాయు పం
స్ఫురణము తట్టి తట్టక క
పోలములందున నెత్తిజేసెడిన్
జిరుచలిసుంత; నీటిపస
జిన్నరికొల్వ గగుర్పు సెందెడిన'
పాలపిట్ట యొకటి ప్రక్కతాళతరువు
మువ్వలోనడాగి కవ్వకూత
విసరజొచ్చె లేత పిదపులనుముద్దు
చివ్వలాగుచ జేవ చెవులుముట్ట
కోతికోయునాడు కూలీలు తమకూతి
కొగ నొక్కపురుషు గానముంటి
పల్లవిపైట కలిపి పల్లింపజొచ్చిరి
కొండయొల్ల మూరు నిండిపోయె!

ఆ సాయంకాలము నే
నే సంగతి నాకు దోపలేదు; మునంజేమో
హా! సగము రంగు కొరసగ
మోసడి సన్న మోము మురువును! అంతే!

'ఒకరోజు' అనే ఈ క్రిందిశీర్షిక కవిభావనా రంజితమైన వీరి ప్రకృతివర్ణన కుదాహృతిగా తీసుకో వచ్చును.

'జీవిత మృత్యుసంబద్ధ పుంభావమయము
గాగ దోషించు మనికి యేలాగొ యనకు;
మండువేసవి చిగురించు మావిమొక్క!
పికుకుకుకుచుంచు జలువ చిప్పిలుమొయిళ్లు!
గొంతులో గద్గదంబిడు వంతియెల్ల
మింగి చిరునవ్వు పెదవుల మేళవించి
పాడుమా కోకిలం బట్ల పాటనొండు!
ఆడుమా! చాతకం బట్లు లతిపిపాస!'

మాటవాడు, ఒకానొక పువ్వును జూచి, ఎవలోబడె నస్తమయము, మొదలైనవీజాతికిచెందిన ఉత్తమప్రకృతివర్ణన చిత్రణలే.

ఈసంపుటిలో కవికొండల వారి ప్రకృతి కవితా వైవిధ్యం చక్కగా ప్రతిఫలించింది. ఇది ప్రకృతి కవితాభిమానులందరికీ అవశ్య పఠనీయమైన సంపుటి.

---

## చికిత్సాసార సంగ్రహము

సంపాదకులు: డాక్టర్. యస్. జానకి రామశాస్త్రి. ప్రకాశకులు: గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ. మదరాసు. వెల: 11-8-0.

గ్రంథ సంపాదకులు పీఠికలో తెలియజేసినట్లిది ఒక ప్రసిద్ధాయుర్వేద గ్రంథం కాదు. గృహస్థు లెవరో ఆయుర్వేద గ్రంథాలన్నీ పరిశీలించి నిత్య కృత్యంలో ఉపయోగించే ఆయాఆయుర్వేద విషయా లన్నీ ఒక తాళపత్రగ్రంథంలో చేర్చారు. అది మదరాసు ప్రాచ్యతాళపత్ర భాండాగారికులు ప్రచురించారు. దానికే చికిత్సా సారసంగ్రహ మని పేరు.

ఇది రాయల్ సైజులో 518 పుటల గ్రంథము. గ్రంథాంతంలో అనుక్రమణిక మొదలయిన ఉపయుక్త విషయాలన్నీ ఉన్నాయి. తప్పొప్పులపట్టిక ఒకటి చేర్చవలసియున్నా, వ్యవధి లేకపోవడంవల్ల ఆపని జరగలేదని సంపాదకులు తమ పీఠికలో తెలియ జేస్తున్నారు.

అయితే ఈ గ్రంథంలో అనేకరోగాలు, వాటి నిదానాలు, ఆయారోగనివారణలకు ఉపయుక్తము లైన మూలికలు, ఔషధాలు, అవి తయారుచేసేవిధా నాలు, ఇంతేకాక పథ్యాపథ్యాలు మొదలైన ఆయుర్వేదానికి సంబంధించిన విశేషాలెన్నో ఉన్నాయి.

గవర్నమెంట్ ఓరియంటల్ లైబ్రరీవారు బహువ్యయప్రయాసలతో ప్రకటించిన ఈ గ్రంథం కేవలప్రాచీన వైద్యశాస్త్రపరిశోధకుల కేమీ సహాయ కారి కాజాలదు.

పోనీ ఇందులోఉన్న ప్రక్రియలు, చిట్కాలు మొదలైనవి జనసామాన్యానికి ఏమైనా ఉపయోగిస్తాయా అంటే అది కనబడదు.

సంపాదకులు తమ పూర్వపీఠికలో "ఈ గ్రంథమున కొన్ని వర్ణ్యభాగములు, పునరుక్తభాగములు, రజితకల్పయోగములు చెప్పబడియున్నవి. కాని పాఠకులు నాటి పరిస్థితులు తెలిసికొనకను, విమర్శ మును మనసులో పెట్టుకొని ఈ భాగముల నుపయోగించిన

ఒకవేళ కోరిన ఫలితములు కలుగక పోవచ్చును." అని వ్రాశారు.

దీనినిబట్టిచూస్తే జనసామాన్యానికికూడా ఇది ఉపయోగపడదని తేలింది.

అందుచేత ఇంతగా ధనవ్యయంచేసి ప్రాచీన వైద్యశాస్త్రీయ గ్రంథం ప్రకటించ దలిచినప్పుడు ఇంతకంటె మరి ఒక సుప్రసిద్ధగ్రంథ మేదైనా ప్రకటించిఉంటే బాగుండేది.

ఏతావాతా ఈ కాలం వైద్యుల కీ గ్రంథంవల్ల ప్రాచీనకాలంలో ఉన్న కొన్ని చిట్కాలు, ప్రక్రియలు కొన్ని ఔషధాల తయారీలు మాత్రమే తెలుస్తాయి. ఇక మిగిలినవాటిలో ఉపపన్నిపాత విధాన మొక్కటే ముఖ్యమైన విషయం.

ఇకముందునింకైనా సంపాదకు లీ విషయాలు జాగ్రత్తగా గమనించి ఇంతకంటె ఉత్తమ శాస్త్రీయ గ్రంథాలు ప్రకటించగలరని ఆశిస్తున్నాము.

**1 తేనెసోనెలు మొదటి సంపుటము**

**2 తేనెసోనలు ద్వితీయ సంపుటము.**

[ఖండకావ్య సంపుటాలు]

రచయిత, విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మ ప్రతులకు రచయిత, 66, సామిపిళ్ళవీధి, మూర్, మదరాసు. సంపుటము ఒక్కొక్కటి: వెల 1-4-0.

ఇవి రెండూ రచయిత అప్పుడప్పుడు రచించిన ఖండకావ్య సంకలనాలు. వీటిలో మొదటిదానికి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, రెండవదానికి శ్రీ ఆండ్ర శేషగిరిరావుగారు ప్రవేశికలు రచించారు.

రచయిత ఈ కాలంలో బాగా ప్రచారంలో ఉన్న ఖండకావ్య రచనాపద్ధతి ననుసరించి ఈ రెండు సంపుటాలలోను, చిన్న చిన్న కథాకావ్యాలు, ప్రకృతి వర్ణనలు, చాటువులు, అనువాద కావ్యాలు, భావచిత్రణలు మొదలైనవన్నీ సమకూర్చారు.

వీరి రచనలో సాంప్రదాయిక ఛ్ఛందస్సులే గాక వినూతన ఫణితిలో రచించిన గేయ ఛ్ఛందస్సులుకూడా ఉన్నాయి.

వీరి కవిత అంతటా భాషాసాంప్రదాయికమైన శిష్టమార్గంలో నిర్దుష్టంగా సాగిపోతుంది.

కవిత మొదటి సంపుటిలోకంటె రెండవ సంపుటిలో కొంచెం హెచ్చుస్థాయిలో నడుస్తుంది. ఈ క్రింది ఉదాహరణలనుబట్టి వీరి పద్యరచనాపద్ధతి కవితాస్థాయి అవగాహన చేసుకోవచ్చును. ఈ వృత్తం వీరు రచించిన ఆంధ్ర సౌందర్యలహరిలోనిది.

"శిశిర రమ్యతాం సుకాంతివయు,
చంద్రకళా రమణీయ చూడనై,
వర మధియంబు, పుస్తకము,
స్ఫాటిక మాలయు దాల్చిచేతులన్
బరగదు, విద్య పత్కృపులు
పల్కరు ప్రొక్కిన గాంత్రుగాద తా
గోరిమను గోస్తనీ మధుపమో
మధురంబుల దివ్యవాక్కులన్"

కోపనాస్వభావవర్ణన పరమైన ఈ క్రింది వృత్తం వీరి స్వీయరచనాఫణితిలో ఉత్తమ కవితకు ఉదాహరణం.

"అల్లిక వేసలిం దొరగి, యంతట
నంతట బూలురాల, న
ల్లల్లన ముంగురుల్ గునిసియాడ
ముఖాంబుజమందు, గాలి చె
క్కిళ్ళను గ్రమ్మ గెంజెదవి
కిప్పుడి కంపమునంద, మిణ్గురుల్
పల్లెదు పల్కమాపుల
పసందగునీ సొబగెంతు సుందరీ!"

## చిన్నయ్య

[జీవిత చరిత్ర]

కొత్త సత్యనారాయణ చౌదరి. అమృతలూరు, గుంటూరు జిల్లా, వల: ఆరణాలు.

ఇది పరవస్తు చిన్నయసూరి చరిత్ర సంగ్రహంగా వివరించే చిన్న పుస్తకం.

ఈ పుస్తకంలో వీరు చిన్నయ సూరి బాల వ్యాకరణాన్ని గురించీ వారికారికలను గురించీ చెలరేగిన వాదోప వాదాలు ఇంకా మిగిలిన చారిత్రిక వివాదాలు ఇంకా వివరంగా ఇచ్చిఉంటే ఇది ఇంకా పాఠక జనోపయోగిగా ఉండేది.

ప్రస్తుత గ్రంథం చిన్నదైనా ఇందులో చిన్నయ్యసూరి జీవితచరిత్రకు సంబంధించిన వివరాలన్నీ ఉన్నాయి.

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad